


తిరుమల తిరుపతి దేవస్థానములు

# సప్తగిరి

సచిత్రమాసపత్రిక

డిసెంబరు 2015 వెల రూ.5/-

తిరుచానూరు

శ్రీపద్మావతీ అమ్మవారి బ్రహ్మోత్సవాలు - 2015

డిసెంబరు 08 నుండి 16 వరకు

# అమ్మవారి వాహనసేవలు - బ్రహ్మోత్సవ సంరంభాలు


08.12.2015
చిన్నశేషవాహనం (రాత్రి)


09.12.2015
పెద్దశేషవాహనం (పగలు)


09.12.2015
హంసవాహనం (రాత్రి)


10.12.2015
ముత్యపుపందిరివాహనం (పగలు)


12.12.2015
గజవాహనం (రాత్రి)


10.12.2015
సింహవాహనం (రాత్రి)


11.12.2015
కల్పవృక్షవాహనం (పగలు)


15.12.2015
రథోత్సవం (పగలు)

11.12.2015
హనుమద్వాహనం (రాత్రి)


13.12.2015
గరుడవాహనం (రాత్రి)


14.12.2015
సూర్యప్రభవాహనం (పగలు)


14.12.2015
చంద్రప్రభవాహనం (రాత్రి)


# అందపు తిరుపుల నలమేలుమంగ

అలరులు గురియగ నాడె నదే
అలకల గులుకుల నలమేలుమంగ ॥

అరవిరి సొబగుల నతివలు మెచ్చగ
అరతెర మఱుగున నాడె నదే
వరసగ పూర్వదువాళపు తిరుపుల
హరి కరిగింపుచు నలమేలుమంగ ॥

మట్టపు మలపుల మట్టెల కెలకుల
తట్టెడి నడపుల దాటినదే
పెట్టిన వజ్రపుడెందపుదళుకులు
అట్టిటు చిమ్ముచు నలమేలుమంగ ॥

చిందుల పాటలు శిరిపాలయాటలు
అందెల మ్రోతల నాడె నదే
కందువ తిరువేంకటపతి మెచ్చగ
అందపు తిరుపుల నలమేలుమంగ ॥

- సంపుటం.12, సంకీర్తన.24

ఈ సంకీర్తనలో నాయిక (అలమేలుమంగ) అభినయంద్వారా తన కోమలమైన శృంగారభావాన్ని వ్యక్తీకరిస్తున్నది. నాయిక ప్రదర్శిస్తున్న అప్పటి నాట్యం కైశికీవృత్తి. ఇద్దరుచెలులు తెరపట్టుకోగా, అలమేలు మంగ ఆ అరతెరమరగున జడను తిప్పతూ, అలరులు కురుస్తుండగా, అరవిరిసొబగులతో రమణీయంగా మనకు సాక్షాత్కరిస్తుంది.






## ఈ నెల నుండి ...

**ఈ నెల నుండి**
**అశేషపాఠకలోకం కోసం**
**మీ (మా) సప్తగిరి మాసపత్రికలో**
**అనేక నూతన శీర్షికలు అందిస్తున్నాం.**
**పాఠకలోకం వీటిని చదివి,**
**మరిన్ని సలహాలు, సూచనలు అందిస్తే 'పత్రిక'**
**మరింత ఆకర్షణీయంగా వెలువరించి,**
**మీ అభిమానాన్ని చూరగొంటాము.**
**- ప్రధాన సంపాదకుడు**

### మరింత పరిశోధన...

మహాశయా! దిద్దుబాట్లు పత్రిక పలుకుబడినీ, తాహతుని, పాఠకుల తెలివిడినీ పెంచుతాయి.

సప్తగిరిలో వర్ణక్రమం సక్రమంగా ఉండాలి. ఇప్పుడు స్వామి వారి వంటింటి ముందున్న మూర్తిని వకుళమాత అంటున్నారు. దీనిమీద మరింత చారిత్రకపరిశోధన అవసరం. ఇటువంటి మూర్తి సంపంగిప్రదక్షిణలోనూ ఉందని డా॥కె.వి.రాఘవా చార్యులు చెప్పారు.

తిరుచానూరులో అమ్మవారితోటకెదురుగా ఉన్న పాఠశాల వెనుక ఒక వేంకటేశ్వరఆలయం ఉన్నది. దీనిగురించి వ్రాయించ గలరు.

*- వి.ఏ.కె.రంగారావు, చెన్నై.*

### ఆసక్తిదాయకం!

మాకు ఏడుకొండలస్వామికి సంబంధించిన అనేక విషయాలు ఈ సప్తగిరిపత్రికవల్లే తెలుస్తున్నాయంటే, అది ఎంతమాత్రమూ అతిశయోక్తికాదు. పత్రికలోని అన్ని అంశాలు ఆసక్తిదాయకంగా ఉన్నాయి. స్వామివారివర్ణచిత్రాలను చూస్తుంటే మాకు స్వామిని ప్రత్యక్షంగా చూసిన అనుభూతి కలుగుతోంది. యాజమాన్యానికి, సిబ్బందికి కృతజ్ఞతలు.

- నీలం శివగంగాధర,
వై.యస్.ఆర్.జిల్లా.

### భక్తిరసప్లావితం

సప్తగిరిపత్రిక అందిన రోజు ఆ వేంకటేశ్వరస్వామే మా ఇంటికి వచ్చిన అనుభూతి కల్గుతోంది. మొదటిపుటనుంచి చివరిపుటవరకు భక్తిరసప్లావితమైన అక్షరాలను అక్షరీకరించి ప్రతినెలా సప్తగిరి పత్రికను అందిస్తున్నారు. అటు పాఠకలోకానికి, ఇటు లోకకళ్యాణానికి పత్రిక పనిచేస్తున్నది.

- గంగరాజు మోహనరావు,
తిరునింద్రవూరు.

### అద్దంపట్టేలా...

సప్తగిరి మాసపత్రికలో వచ్చే ప్రతిశీర్షిక ఆధ్యాత్మికతకు అద్దం పట్టేలా ఉంది. పిల్లల నుంచి పెద్దలవరకు అందరిలో ఆధ్యాత్మిక అవగాహన పెంపొందించేలా వ్యాసాలు తీర్చి దిద్దుతూ, మమ్మల్ని ఏదో దివ్యలోకానికి తీసు కెళ్లుతున్నట్లు ఉన్నందుకు మీకు కృతజ్ఞతలు.

- వి.ఎన్.ఎస్.ఆచార్యులు, నర్సాపురం.

### 2016 జనవరి నెల ఉత్సవాలు, పండుగలు

| | |
|---|---|
| 03 | తిరుమల శ్రీవారిసన్నిధిలో అధ్యయనోత్సవసమాప్తి. |
| 07 | శ్రీతొండరడిప్పొడియాళ్వారు వర్ష తి.న., శ్రీ ఆండాళ్ నీరాటోత్సవ ప్రారంభం. |
| 09 | తిరుపతి శ్రీగోవిందరాజస్వామివారిసన్నిధిలో అధ్యయనోత్సవప్రారంభం. |
| 14 | భోగిపండుగ. |
| 15 | మకరసంక్రమణం సంక్రాంతి పండుగ. |
| 16 | కనుమపండుగ, శ్రీగోదాపరిణయోత్సవము, తిరుమల శ్రీవారు పార్వేటమండపంలోకి వేంచేయుట. |
| 22 | శ్రీకపిలేశ్వరస్వామివారిసన్నిధిలో శ్రీకామాక్షీదేవికి చందనాభిషేకము. |
| 26 | శ్రీతిరుమొళిశైయాళ్వారువర్ష తి.న. |
| 29 | శ్రీకూరత్తాళ్వార్ వర్ష తి.న. |

వేంకటాద్రిసమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన।
వేంకటేశసమో దేవో న భూతో న భవిష్యతి ॥



మాతల్లి అలమేలుమంగ....!!


గౌరవ సంపాదకుడు :
డా॥ డి. సాంబశివరావు, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి, తి.తి.దేవస్థానములు.

ప్రచురణకర్త-ప్రధాన సంపాదకుడు :
డా॥ సి.శైలకుమార్

సంపాదకుడు : డా॥ కె.రాధారమణ

ఉపసంపాదకుడు : డా॥ కంపల్లె రవిచంద్రన్

ముద్రాపకురాలు : యమ్.గౌతమి, ఎం.బి.ఎ.,
ఉపకార్యనిర్వహణాధికారి,
(ప్రచురణలు & ముద్రణాలయం)
తి.తి.దే., తిరుపతి

వర్ణ చిత్ర పుటలు : పి.శివప్రసాద్

పుటల రూపకల్పన : బి.గురుకుమార్ రెడ్డి






విడి ప్రతి : రూ. 5/-
సం॥ చందా : రూ. 60/-
జీవిత చందా : రూ.500/-
విదేశాలకు సం॥చందా : రూ. 850/-


# సప్తగిరి

## తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక


సంపుటి : 46 | డిసెంబరు, 2015 | సంచిక : 7




ముఖచిత్రం : శ్రీపద్మావతీ అమ్మవారు (తిరుచానూరు)
వెనుకచిత్రం : శ్రీగోదాదేవి అలంకారంలో శ్రీవారు (తిరుమల)



24 గంటలు పనిచేసే తిరుమల తిరుపతి దేవస్థానముల కాల్ సెంటర్ ఫోన్ నెం.

**0877 - 2277777, 2233333**



# విచ్చేయవమ్మా...
# వెన్నెలబొమ్మా...!



సంసారదుఃఖాల్ని తొలగించి, జీవన్ముక్తిమార్గాన్ని బోధించేవి– ఉత్సవాలు. ఈ ఉత్సవాలు సాంస్కృతిక, ధార్మిక, ఆధ్యాత్మిక, ఐకమత్య, భక్తిభావాల్ని ఉద్దీపింపచేస్తాయి. భగవంతునివైభవాన్ని ఆవిష్కరిస్తాయి.

తిరుమలశ్రీవారికి బ్రహ్మోత్సవాలు జరిగినట్లే – తిరుచానూరు శ్రీపద్మావతిఅమ్మవారికీ కార్తికమాసంలో (సౌరమానంరీత్యా) మహావైభవంగా బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. అమ్మవారికి ప్రత్యేకంగా బ్రహ్మోత్సవాలు జరగడం ఇక్కడి విశేషం. బ్రహ్మశబ్దానికి సృష్టికర్త, చతుర్ముఖుడు అయిన బ్రహ్మ అనే గాక – గొప్పది, పెద్దది, సర్వవ్యాపకమైనది, పరబ్రహ్మ – అనే అర్థాలూ ఉన్నాయి. కనుక తిరుచానూరు మున్నగు చోట్ల జరిగే నవాహ్నికఉత్సవాలు – గొప్పవీ, పెద్దవీ కనుక – ఇవికూడా బ్రహ్మోత్సవాలే! విశ్వమంతా వ్యాపించినవాడు పరబ్రహ్మ. అతడే అన్నిరూపాల్లో, అన్నిచోట్లా ఉన్నాడు. కనుక పద్మావతిఅమ్మవారిరూపంలో ఉన్నదీ పరబ్రహ్మే! అట్టి సాకారపరబ్రహ్మకు జరిగే ఉత్సవాలు కనుక బ్రహ్మోత్సవాలు.

శ్రీవారికి ఎంతో ఘనంగా జరిగే బ్రహ్మోత్సవాల్ని– ఆయన వక్షఃస్థలంలోనే కొలువైన లక్ష్మీదేవి చూస్తూ సంతోషిస్తుంది. ఆ లక్ష్మీదేవియే, కారణాంతరాన పద్మావతీదేవిగా అవతరించింది. లక్ష్మి విష్ణువుకు అనపాయిని – అంటే ఎన్నడూ స్వామిని వదలి ఉండనిది. అయినా లోకరక్షణకై – భౌతికంగా తిరుచానూరుక్షేత్రంలో అవతరించి, ప్రత్యేకంగా ఉంటూంది. శ్రీవారు లక్ష్మీప్రియుడు. అమ్మవారు హరిప్రియ. కనుక అనపాయిని, లక్ష్మీరూపిణి అయిన పద్మావతీదేవికికూడా తనకువలే ఘనంగా బ్రహ్మోత్సవాలు నిర్వహింపజేయడంలో భార్యపై భర్తకుండాల్సిన దాంపత్యప్రేమవైభవం నిరూపితమవుతోంది.

లక్ష్మికి హృదయంపై, హృదయంలోపలా చోటిచ్చిన శ్రీవారు–శ్రీదేవి అయిన పద్మావతికి బ్రహ్మోత్సవాలు జరపడంలో ఆశ్చర్యం ఏముంది? తన వాహనాలన్నీ అమ్మవారికి పంపుతారు. తానూ దివ్యరూపంలో ఆ ఉత్సవాలలో అధిష్ఠించే ఉంటారు. ఈ ఉత్సవాలలో అమ్మవారిప్రక్కనున్న స్వామిని దర్శించడం – దివ్యదృష్టికే సాధ్యం.

స్త్రీని గౌరవించనిదేశం, దేహం పతనం కాక తప్పదు. సాధారణంగా ఎక్కడా లేనివిధంగా – తిరుచానూరులోమాత్రమే జరిగే అమ్మవారిఉత్సవాలు – భక్తకోటికి మాతృత్వవిశిష్టతను గుర్తు చేస్తాయి. సంప్రదాయంకూడా – పురుషకారిణి అయిన అమ్మవారిని మొదట దర్శించి, పిదప తిరుమలశ్రీవారిని దర్శించాలనే కదా!

తిరుమలవి శ్రీవారిఉత్సవాలు. తిరుచానూరువి శ్రీఉత్సవాలు. దంపతులలో ఎవరికి ఉత్సవాలు జరిగినా సంతోషం ఇద్దరికీ సమానమే! దాంపత్యం అవిభాజ్యతత్త్వం! అక్కడ గరుడసేవకు ప్రాధాన్యం. ఇక్కడ గజసేవకు ప్రాముఖ్యం. అమ్మవారు గజలక్ష్మీ రూపిణి కదా. ఇలా భక్తులు తల్లినీ, తండ్రినీ, భక్తి శ్రద్ధలతో సేవించి, ఆనందనిలయులు కావడానికి – పద్మావతిఅమ్మవారిఉత్సవాలు ప్రత్యేకంగా నిర్వహింపబడుతున్నాయి. ఆగమాలు వేరయినా – భక్తుల ఆగమనంమాత్రం సర్వత్ర సమానమే.

తి.తి.దే. శ్రీవారిఆజ్ఞతో అమ్మవారిబ్రహ్మోత్సవాలనూ మహావైభవంగా నిర్వహిస్తూంది. భక్తులు విశేషంగా వచ్చి, అమ్మను దర్శించి, కలుములతల్లిదయతో లేములు తొలగించుకోగలరని ఆశిస్తున్నాం.




# హరివెంట సిరి

– సామవేదం షణ్ముఖశర్మ

**ఈ** విశ్వం ఐశ్వర్యమయం, సూర్యచంద్రులు, వర్షం, ఋతువులు, భూమి, పంటలు, నదులు, పర్వతాలు, పువ్వులు, ఫలాలు, మన ఇంద్రియశక్తులు, స్నేహితులు, కుటుంబం... అన్నీ మనజీవితానికి అవసరమైనఐశ్వర్యాలు. ఈ ఐశ్వర్యశక్తినే **'మహాలక్ష్మి'** అని ఆరాధించడం మనసంప్రదాయం.

సిరిసంపదలలో ఉన్న దివ్యత్వాన్ని లక్ష్మీదేవతాకృతిగా దర్శించారు– మహర్షులు. జగత్కారణుడైన ఈశ్వరునిశక్తే లక్ష్మి. ఈ ఈశ్వరత్వం విశ్వవ్యాపకమైంది కనుక 'విష్ణువు' అని పిలుస్తారు. ఆయనశక్తి లక్ష్మి. యోగ్యుడైనవాణ్ణి విష్ణుకృప లక్ష్మీదేవిగా అనుగ్రహించి, సంపన్నుణ్ణి చేస్తుంది. అతడు ఆ యోగ్యతను వదలుకుంటే, ఆ సంపద క్రమంగా హరించుకుపోతుంది.

అందుకే సంపద లభించినప్పుడు మరింత అణకువగా (అహంకారం లేకుండా) సత్ప్రవర్తనతో, ఆ సంపదను భగవత్ప్రసాదంగా భావించడం ఉత్తమస్వభావం.

మహాలక్ష్మి అనగానే కేవలం ధనరూపిణియే కాదు, శుద్ధసత్త్వస్వరూపిణి, శుభంకరమైనగుణాలకు సాకారం. సౌమ్యం, కారుణ్యం, శాంతం, ఉత్సాహం, ఉల్లాసం,

**మహాలక్ష్మి
అనగానే... కేవలం....
ధనరూపిణియే కాదు,
శుద్ధసత్త్వస్వరూపిణి,
శుభంకరమైన గుణాలకు సాకారం.**

**సౌమ్యం, కారుణ్యం,
శాంతం, ఉత్సాహం, ఉల్లాసం,
అనసూయత, మంగళత్వం,
సాత్త్వికత.... మొదలైన
కల్యాణగుణాల
సమాహారస్వరూపమే శ్రీలక్ష్మి.**





అనసూయత, మంగళత్వం, సాత్త్వికత.... మొదలైన కల్యాణగుణాల సమాహార స్వరూపమే శ్రీలక్ష్మి.

ఈ తల్లికి 'పద్మా' అనే పేరుంది. విక సించే లక్షణమే పద్మం. పద్మం వికసించిన జ్ఞానానికీ, ఐశ్వర్యానికీ చిహ్నం. విష్ణుని హృదయపద్మంలో లక్ష్మీదేవి ఉందని మన శాస్త్రాలు పేర్కొంటున్నాయి. దీనిఅర్థం – మహావిష్ణుసంకల్పశక్తే లోకంలో ఐశ్వర్యంగా వ్యాపించింది – అని గ్రహించాలి.

ఆయన మనస్సంకల్పం, మనసులోని దయాఐశ్వర్యాల తల్లిగా అనుగ్రహిస్తు న్నది. అయితే ఈ లక్ష్మీదేవి హృదయంవద్దనే కాక, స్వామిచరణాలచెంతకూడా కొలువై, ఆయనపాదపద్మాలను సేవిస్తూంది. ఎంతచక్కనిఅద్భుతభావన ఇది! హృదయంలోని ఆదిలక్ష్మే, పాదాలవద్ద సేవిక. స్వామి శ్రీజననికి ఇచ్చిన చోటు హృదయం. అది ఆయనఅనురాగం. లక్ష్మమ్మకు ఇష్టమైనచోటు స్వామిపదపద్మం. అది ఆమెఅంకితప్రణయం, సేవాపరాయణత్వం. దాంపత్యధర్మానికి ఇంతచక్కని ఉదాహరణం ఇంకెక్కడ కనిపిస్తుంది?!

భగవంతుడు తనహృదయంలోని దయను మనకు సంపదరూపంగా అను గ్రహిస్తే, దాన్ని మనం భగవంతునిచరణాలకు కైంకర్యరూపంగా అర్పించాలనేభావన ఈ స్వరూపంలో గోచరిస్తూంది. నిస్స్వార్థమైన స్వధర్మనిర్వహణను భగవదారాధనగా సాగించడమే కైంకర్యం. మహాలక్ష్మి స్వాభావికంగా విష్ణుదేవుని ఐశ్వర్యశక్తి. ఇంద్రుడు తపశ్శక్తితో ఆరాధించి, లక్ష్మీనారాయణులదయతో ముల్లోకాలఐశ్వ ర్యాన్నీ సంపాదించాడు. కానీ, క్రమంగా సంపదలవల్ల అహం పెరిగి, అంతా తనప్రయోజకత్వమనే భావనతో అవినయం అలవడి, లక్ష్మీకటాక్షాన్ని కోల్పోయాడు. మరలా పశ్చా త్తాపంతో పాలకడలిని మథించగా అమ్మవారు ఆవిర్భ వించింది. కానీ, ఆ తల్లి దేవతాసమూహా న్నంతటినీ కాదని, నారాయణునే వరించింది. అంటే సంపద ఎప్పుడు వచ్చినా, అది లోకేశ్వరునిదే అనే జ్ఞానాన్ని మనకు కలిగిస్తూంది.

ముందు సంపదపై కాకుండా, సంపదకు మూలకారణుడైన భగవానునిపై దృష్టి నిలపాలి. గజేంద్రుడు శ్రీహరికోసం మొరపెట్టగా–హరి అన్నింటినీ మరచి, వదలి తా నొక్కడే కదిలాడు. హరి కది లిన వెంటనే– హరివెంట సిరి బయలుదేరింది. సిరి వెంట హరి కాదు – హరివెంట సిరి. హరిని వదలని పతివ్రత సిరి. హరిని కొలిచినవారిని సిరి అనుగ్రహిస్తుంది. హరిని భక్తితో కదిలిస్తే చాలు – ఆయనవెంట బలమూ, బలగమూ కదిలివచ్చి మనల్ని ఆదుకుంటాయి. ఆయన్ను మరచి, సిరినే కోరితే లాభం లేదు! లక్ష్మీనారాయణుల అన్యోన్యత– ప్రపంచనాయకునికీ– ఆ తల్లికీ ఉన్న అవిభాజ్యాన్ని తెలియజేస్తూంది. హరి ఏ అవతారం దాల్చినా ఆయనవెంట ఉండే 'అనపాయిని' (వీడనిది) అమ్మ. ●



## ధనుర్మాసంలో తెప్పోత్సవం

**21-12-2015 సోమవారం నుండి 25-12-2015 శుక్రవారం వరకుతిరుపతి, శ్రీకపిలేశ్వరస్వామి ఆలయంలో వెలసిన శ్రీవిఘ్నేశ్వరస్వామి, శ్రీచంద్రశేఖరస్వామి, శ్రీసుబ్రహ్మణ్యస్వామి, శ్రీసోమస్కందస్వామివార్లకు, శ్రీకామాక్షి అమ్మవారికి, శ్రీచండీశ్వరస్వామి, శ్రీచంద్రశేఖర స్వామివార్లకు పంచాహ్నికంగా ధనుర్మాసంలో తెప్పోత్సవం జరుగుతుంది.**

# శ్రీ సూక్తంలో పద్మావతి

- డా॥ ఈ.ఏ. శింగరాచార్యులు

**శ్రీలక్ష్మీవైభవాన్ని**
**అతిమనోహరంగా వర్ణించింది శ్రీసూక్తం.**

**ఇందులో.....**
**పఠింపబడ్డ లక్ష్మీనామాలలో**
**పద్మ శబ్దం కల్గిన పేర్ల అర్థాన్ని**
**అనుసంధించడంద్వారా పద్మావతీదేవిమహిమను**
**ఆ అమ్మకు జరిగే బ్రహ్మోత్సవాల**
**సందర్భంలో స్మరించుకుందాం.....!!**

శ్రీ సూక్తంలో కన్పించే అనేకనామాలలోని నాల్గునామాలలో పద్మశబ్దం ప్రయోగింపబడింది. ***"పద్మే స్థితా, పద్మవర్ణా, పద్మనేమీ, పద్మమాలినీ"*** అనేవి - నాల్గునామాలు. వీటి అర్థాన్ని క్రమంగా సంగ్రహంగా భావిద్దాం!

### పద్మే స్థితా

తామరపూవులో ఉన్నది - అని దీని భావం. తామరపూవులో ఉండే అందం, సుగంధం, మార్దవం- మొదలైన గుణాలన్నీ ఒకరూపాన్ని ధరించి, లక్ష్మిగా ఆవిర్భవించాయా? అని సందేహ పడేటట్లు ఈమెరూపు ఉంటుంది. ఇందువల్లనే కదా ఆళ్వార్లు ఈమెను **"తామరైయాళ్"** అనీ, "కమల ప్పావై" అనీ, **"అలర్ మేల్మఙ్గై"** అనీ, **"మలర్ మఙ్గై"** అనీ, **"వేరి మాఱాద పూమేల్ ఇరుప్పాళ్"** (పరిమళం మారని తామరపూవులో ఉన్నది) అనీ బహుధా కీర్తించారు.

లక్ష్మీతంత్రం అనే పాంచరాత్రాగమ గ్రంథంలో విశిష్టమైన రీతిలో ఈ నామం వివరింపబడింది. ***"పద్యమానం మినో తీతి కాలం పద్మం ప్రచక్షతే, కాలమప్యఖిలం శశ్వత్ కలయంతీ స్థితా సదా"*** (తాను కదలుతూనే మిగిలిన చరాచరాలను అన్నిటినీ పరిచ్ఛేదిస్తుంది కనుక కాలం **'పద్మ'** మని అనబడుతున్నది. ఆ కాలాన్ని అంతటినీ నేను నిర్వహిస్తున్నాను కనుక నేను **"పద్మేస్థితా"** అనబడుతున్నాను) అని స్వయంగా లక్ష్మీదేవి తెలిపినట్లు ఆ గ్రంథం వ్యక్తం చేస్తున్నది. ఈ నామాన్ని అనుసంధించేవాడు కాలాతీతుడు, కృతార్థుడు కాగలడనికూడా అందులో పేర్కొనబడింది.

### పద్మవర్ణా

తామరపూవువర్ణంవంటి వర్ణాన్ని కలిగింది అని దీనిభావం. అందువల్ల, నల్లవిసెపూవు రంగువంటి రంగుగల స్వామియొక్కదివ్యమంగళవిగ్రహానికి పరమశోభను కల్గించే మనోహరమైనవర్ణాన్ని ఈమె కల్గి ఉన్నదని తెలుస్తున్నది. కోశం-



రేకులు-ఈ రెంటిని చేర్చి గ్రహించి ఉండేభాగం-అనే మూడుభాగాలు కల తామరపూవువలే చిత్అచిత్తులను, వాటిని కలిపి ధరించి ఉండే ఈశ్వరుడు - అనే త్రివిధతత్త్వాలు ఉండడంచేత, పద్మశబ్దవాచ్యాలైన ఈ మూడుతత్త్వాలను, సూర్యుడు తనప్రకాశంతో తామరపూవును ప్రకాశింపచేసేటట్లు, తన

తేజస్సుతో ప్రకాశింపజేసేది కనుక-లక్ష్మీదేవి **"పద్మవర్ణా"** అనబడుతున్నదనికూడా చెప్పవచ్చు.

**'పద్మవర్ణేతి మాం స్తుత్వా'** - అని లక్ష్మీతంత్రంలో తెలుపబడింది. అందువల్ల ఈ నామం- పురుషకారం చేయడం ద్వారా జీవుణ్ణీ, తనస్వరూపస్వభావాలతో స్వామినీ ఆనందింప జేస్తుందనే అర్థం ద్యోతకమవుతున్నది.

## పద్మనేమీ

సూర్యుణ్ణి చూచి వికసించే తామరవలె, లక్ష్మీదేవి తన సన్నిధివల్ల సృష్టి మొదలైన వికాసాలను పొందేపద్మాలు అనే ప్రకృతిపురుషులను తన కాంతితో వికసించేటట్లు చేస్తుంది అని దీని భావం. ***"పద్మాన్ ప్రకృతిపురుషాన్ నయతీతి పద్మనేమీ"*** (ప్రకృతి, పురుషుడు - అనే పద్మాలను వికసింపజేసేది కనుక **"పద్మనేమీ"** - అనబడుతున్నది) అని ఈ శబ్దవ్యుత్పత్తి.

**యస్యాః కటాక్షమృదువీక్షణదీక్షణేన**
**సద్యః సముల్లసితపల్లవ ముల్లలాస ।**
**విశ్వం విపర్యయ సముత్థవిపర్యయం ప్రాక్**
**తాం దేవదేవ మహిషీం శ్రియ మాశ్రయామః ॥**

(ఏ లక్ష్మీదేవి తన కటాక్షాలను మెల్లగా ప్రసరింపజేయ గానే- ప్రళయకాలంలో ఆ కటాక్షాలు లేకపోవడంవల్ల లేకుండా పోయిన లోకం-వెంటనే చిగురించేటట్లు వికాసాన్ని పొందిందో, దేవదేవుని పట్టపురాణి అయిన ఆ లక్ష్మీదేవిని ఆశ్రయిస్తున్నాను) అని అంటూ కూరేశులు ఈ అర్థాన్ని శ్రీస్తవం అనే స్తోత్రంలో ఆవిష్కరించారు.

**"పద్యమానం మినోతీతి కాలం పద్మం ప్రచక్షతే"** అని పూర్వం పేర్కొన్న లక్ష్మీతంత్రంలోని వ్యుత్పత్తిచేత పద్మశబ్దం కాలాన్ని తెల్పేది అని తెలుస్తున్నది. చక్రంనడుమన ఉండే నాభికి బయట ఉండే నేమివలె (చక్రం చుట్టూ ఉండే ఇనుపకమ్మి) కాలానికి ఈమె ఆవలిగా ఉంటుంది. కాబట్టి **"పద్మనేమీ"** అనబడుతున్నదనే అర్థాన్నికూడా చెప్పవచ్చు. **"కాలం న వచతే తత్ర న కాల స్తత్రవై ప్రభుః"** (విష్ణుపురాణమ్) (ఆ పరమపదంలో పరమాత్మకాలాన్ని నియమిస్తున్నాడు. అక్కడ కాలం పాలించడం లేదా) అనేరీతిలో కాలానికి కట్టుబడనిది అని భావం.

## పద్మమాలినీ

ఈ నామం రెండుమంత్రాలలో కన్పిస్తున్నది. ముందుగా **'కర్దమేన'** అని ప్రారంభం అవుతున్న 11వ మంత్రం చివరలో మొదటిసారి కన్పిస్తున్నది. ఆ మంత్రానుసారం ఈ నామార్థాన్ని ఈ విధంగా అనుసంధించవచ్చు.

**"పద్మమాలినీ"** - తామరలమాలను కల్గినది అని అర్థం. తామరపూవును ఆసనపద్మంగా గ్రహించినదిగా, చేతిలో లీలా పద్మాన్ని కల్గినదిగా, శిరఃపద్మం క్రింద ఉండేదిగా, తామర పూలమాలను ధరించినదిగా ఈమె ఉంటుంది. కాబట్టి కదా ఈమె **"తామరైయాళ్"** అని, **"మలర్‌మకళ్"** అని, **"కమలప్పావై"** అని, **"మలరాళ్"** అని దివ్యసూరులచేత కీర్తింపబడింది. మరొక రకంగా చెప్పాలంటే, సుషుమ్నానాడి అనే పేరుతో శిరస్సులో ఒకనాడి ఉన్నది. మోక్షాన్ని పొందేవారు ఈ నాడిద్వారానే బ్రహ్మ రంధ్రాన్ని భేదించుకొని, పరమపదాన్ని చేరుతారు- అని ఉప నిషత్తులలో చెప్పబడుతున్నది. ఈ నాడిలో ఆధారపద్మాలు అనబడే ముప్పైరెండుపద్మాలు అమరి ఉంటాయి. ఈ నాడిగానే చెప్పబడేది, ఈ నాడిలో సంచరించేది అయిన లక్ష్మీదేవి ఈ పద్మాలు అనే మాలచేత అలంకరింపబడినదిగా సాక్షాత్కరి స్తుంది. అందువల్లకూడా **"పద్మమాలినీ"** అని అనబడుతున్నది.

ఇంతకు ముందే పద్మశబ్దం కాలాన్ని నిర్దేశిస్తుందని **"పద్మే స్థితా"** అనే నామవివరణంలో చెప్పబడింది. **"పద్మవర్ణా"** మరియు **"పద్మనేమీ"** అనే నామవివరణలలో చెప్పినట్లు సూర్యునివల్ల వికసించే తామరవలె, లక్ష్మివల్ల వికసించేవారుగా చెప్పబడ్డ ప్రకృతిపురుషులను తామరమాలవలె ధరించి, నిలచేది కనుక **"పద్మమాలినీ"** అని అనబడుతూందనికూడా చెప్పవచ్చు. ఈ విషయం ***"ప్రకృతిం పురుషం చైవ కాలం చాపి సనాతనమ్, ధారయామి స్వరూపేణ తతోఽహం పద్మమాలినీ"*** అనే లక్ష్మీ తంత్రవచనంద్వారా ఆవిష్కరింపబడింది. ఇదే అర్థాన్ని 12వ మంత్రంలో కూడా కన్పించే ఈ నామానికి చెప్పవచ్చు. ఇందుకు అనుగుణంగా **"పూవార్ తిరుమామకళ్"** (తామరపూలను నిండుగా కల లక్ష్మీదేవి)వంటి దివ్యసూరిసూక్తుల భావాలు అనుసంధేయాలు. పద్మసరస్సులో, పద్మంమధ్యలో అవతరించిన పద్మావతీదేవికి కన్నులపండువుగా జరిగే బ్రహ్మోత్సవాల స్ఫూర్తిగా **'పద్మ'** శబ్దానికి గల పలువివరణలు పైవిధంగా ప్రస్తావించబడ్డాయి. ●



# ఉత్తరద్వారం తెరచేరోజు

- పి. విజయలక్ష్మి

21-12-2015, వైకుంఠఏకాదశి దివ్యపర్వసందర్భంగా......

తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయంలోని వైకుంఠ మార్గ దృశ్యం

ఇరవైనాలుగు ఏకాదశుల్లోనూ- సౌర మానంలో, ప్రశస్తమైన ధనుర్మాసంలో (మార్గశిర/పుష్యమాసాల్లో) వచ్చే శుక్లపక్షఏకాదశిని **"వైకుంఠఏకాదశి"**గా కీర్తిస్తున్నాము. దీన్నే **"ముక్కోటి ఏకాదశి"** అంటారు. సౌరమానం ధనుర్మాసం కాగా, అందు వచ్చే 'వైకుంఠ ఏకాదశి' చాంద్రమానానుసారిణి. శ్రీమన్నా రాయణునికి సూర్యుడు కుడికన్ను. చంద్రుడు ఎడమకన్ను. కన్నులు వేర్వేరుగా ఉన్నా దృష్టి ఒక్కటే ఐనట్లు. సూర్యచంద్రులు వేర్వేరుగా కన్పి స్తున్నా - కాంతితత్త్వం ఒక్కటే అనే మహాతత్త్వాన్ని ఈ పండుగ సూచిస్తుంది.

## ఇందరికీ అభయంబులిచ్చు చేయి.....

వైకుంఠఏకాదశి సామాన్యంగా మార్గశిర పుష్యమాసాల్లో వస్తుంది. రావణునిబాధలు తాళ లేనిదేవతలు బ్రహ్మను వెంటబెట్టుకొని, వైకుంఠం చేరారు. హరివాసరమైన మార్గశిరశుక్ల ఏకాదశి నాడు శ్రీహరిని ప్రార్థించి, తమబాధను విన్నవించారు. స్వామి బ్రహ్మాదులకు దర్శన మిచ్చి, అభయ మొసగడం జరిగింది. కాగా దేవతలబాధలను నివారించ దానికి ఈ ఏకాదశియే మార్గం చూపింది. మరో వృత్తాంతం - మధుకైటభులను మహావిష్ణువు సంహరించినపుడు వారు దివ్యరూపాలు ధరించి, దివ్యజ్ఞానాన్ని పొంది, "దేవా! వైకుంఠంవంటి మందిరాన్ని నిర్మించి, ఏకాదశీపూజ గావించి, నిన్ను దర్శించి, నమస్కరించి, ఉత్తరద్వారమార్గంలో నిన్ను సమీపించేవారికి శ్రీవైకుంఠప్రాప్తి అనుగ్రహించు"మని ప్రార్థించారు. స్వామి 'తథాస్తు' అని సంతోషంతో అనుగ్రహించారు. దీనికి **'మోక్షోత్సవదిన'** మనికూడా పేరు. ముక్కోటిదేవతలకు బాధలు నివారించినఏకాదశి కనుక "ముక్కోటి ఏకాదశి" అని పేరు. (ముక్కోటి అనేది 33 కోట్లకు సంకేతం అంటారు.) వైకుంఠదర్శనం కల్గిస్తుంది కనుక "వైకుంఠఏకాదశి". భగవద్దర్శనం గావించేది కనుక **"భగవ దవలోకన దినం".** మార్గశిరమందలి శుక్లఏకాదశి - 'మోక్షదైకాదశి'. (మోక్షాన్ని ఇచ్చే ఏకాదశి), పుష్యశుక్లఏకాదశి-'పుత్రదైకాదశి'(పుత్రప్రాప్తి చేకూర్చేఏకాదశి).

శుక్లఏకాదశినాడు సూర్యునినుండి వెలువడిన పదకొండవకళ చంద్రుణ్ణి ప్రవేశిస్తుంది. బహుళఏకాదశినాడు చంద్రమండలంనుండి పదకొండవకళ సూర్యమండలాన్ని చేర్తుంది. ఇలా రాకపోకలవల్లే "ఏకాదశి" అనేపేరు సార్థకమయింది. "ఏకాదశ్యా ముపవసే న్న కదాచి దతిక్రమేత్"-ఏకాదశినాడు తప్పక ఉపవాసం చేయాలి. "ఉపవాసః స విజ్ఞేయః, సర్వభోగవివర్జితః" ఉప వాసంనాడు - పాప కృత్యాలకు దూరంగా



ఉండాలి. సకలభోగాలను వదలి, పుణ్యకార్యాలు చేయడమే ఉపవాసం అని పెద్దలమాట! ఇంద్రియప్రకోపాన్ని అణచి, 11 ఇంద్రియాలను (పంచకర్మేంద్రియాలు, పంచజ్ఞానేంద్రియాలు, మనస్సు) భగవంతునిసన్నిధిలో వసింపజేసేదే నిజమైన ఉపవాసం. ఏకాదశీవ్రతం దశమి రాత్రితో ప్రారంభమై, ద్వాదశిఉదయంతో పూర్తి అవుతుంది. అందరూ ఈ వ్రతాన్ని ఆచరించవచ్చు!

ఎనిమిదేండ్లలోపు వయస్సున్న పిల్లలూ, ఎనభైయేండ్లు దాటిన వృద్ధులూ ఉపవాసం చేయాల్సినపనిలే దని కాత్యాయనస్మృతి పేర్కొనింది.

### పేరు వెనుక పరమార్థం

పూర్వం కృతయుగంలో చంద్రావతీనగరాన్ని పాలించే 'మురు' డనే రాక్షసు డుండేవాడు. దేవతల్ని జయించి, వేధించేవాడు. విష్ణువు వానితో వెయ్యేండ్లు యుద్ధంచేసి, అలసి, విశ్రాంతికై ఒకగుహలో చేరి, నిద్రించాడు. అట్టి శ్రీహరిని సంహరించదానికి మురుడు సిద్ధపడగా, స్వామి శరీరంనుండి దివ్యతేజస్సులతో ఒకకన్య ఉద్భవించింది. దివ్యాస్త్రాలతో యుద్ధంచేసి, ఆ కన్య మురుణ్ణి సంహరించింది. విష్ణువు మేల్కొని కన్యనూ, మరణించియున్న మురుణ్ణీ చూచి, ఆశ్చర్యపడ్డాడు. కన్య నమస్కరించి, జరిగిందంతా విన్నవించింది. సంతోషించిన విష్ణువు ఆమెను వరం కోరుకొమ్మన్నాడు. ఆమె ఆనందంతో "దేవా! నేను ఏకాదశినాడు నీదేహంనుండి ఉద్భవించాను– కనుక నా పేరు ఏకాదశిగా, నా వ్రతం చేస్తూ, ఈనాడు ఉపవాసం ఉండేవారు సంసార బంధాలనుంచీ తరించేట్లుగా వరమిచ్చి, అనుగ్రహించండి" అని ప్రార్థించింది. స్వామి "అట్లే అగుగాక!" అని వరమిచ్చి, అదృశ్యుడైనాడు. నాటినుండి ఏకాదశీ వ్రతం భక్తితో ఆచరించేవారు సకలపాపాలనుండి విముక్తులై, విష్ణులోకాన్ని పొందుతా రనే ప్రశస్తి ఏర్పడింది.



ఏకాదశీతిథికి అధిదేవత ఏకాదశీదేవి. ఈమె విష్ణుదేహం నుండి రూపొందింది కనుక స్త్రీ మూర్తియైన శ్రీవిష్ణుభగవానుడే! సర్వోత్తమతిథి–ఏకాదశి. ఏకాదశీ వ్రతప్రభావాన్ని వివరించే కథలు చాలా ఉన్నాయి.

### ఎంతమందో....

సుకేతు డనేరాజు విశ్వేదేవతల ఉపదేశానుసారం పుష్య శుక్లఏకాదశీవ్రతాన్ని ఆచరించి, భగవదనుగ్రహంవల్ల పుత్రవంతుడైనా డని పద్మపురాణం పేర్కొనింది.

సకలపాపాలనుండి విముక్తి చెంది, శ్రీకైవల్యప్రాప్తితో

పునర్జన్మలేని స్థితిని పొందడానికి వైకుంఠఏకాదశీవ్రతాన్ని మించిన వ్రతాచరణం లేదు.

దేవదానవులు ఈ ఏకాదశిరోజు ఉపవాసంతో రాత్రింబవళ్లూ శ్రమించి, క్షీరసాగరాన్ని మథించారు. ద్వాదశినాడు మహాలక్ష్మి సముద్రంనుండి వెలువడి వచ్చి, దేవతలకు ప్రత్యక్షమై, వారిని అనుగ్రహించింది. నాటి నుండి ఏకాదశినాడు పగలూ, రాత్రి ఉపవాసంతో ఉండి, జాగరణం చేసి, శ్రీహరిని స్తుతించినవారికి స్వామికృపవల్ల ముక్తి కరతలామలక మవుతుం దనే నమ్మకం ఏర్పడింది.

కుచేలుడు ఏకాదశీవ్రతాన్ని ఆచరించి, మహైశ్వర్యవంతుడైనా డని ఐతిహ్యం. ధర్మరాజు ఆచరించి, కష్టాలనుండి గట్టెక్కినాడు. రుక్మాంగదుడు ఆచరించి, పుత్రప్రాప్తి పొందడమే కాక – సకలదేవతాకృపాపాత్రుడై, మోక్షపథగామి అయినాడు. క్షీరసాగర మథనం– లక్ష్మీఆవిర్భావం ఏకాదశినాడే జరిగాయి. వైఖానస రాజు ఆచరించి, పితరులకు ఉత్తమలోకప్రాప్తి చేకూర్చాడు. అంబరీషునివ్రతప్రభావం జగద్విదితం.

**ఆధ్యాత్మికస్ఫూర్తి**

'వైకుంఠఏకాదశి' లో వైకుంఠ, ఏకాదశి అని రెండుపదా లున్నాయి. 'వైకుంఠ' శబ్దం విష్ణువునూ, విష్ణు వుండేస్థానాన్నీకూడా సూచిస్తుంది. చాక్షుష మన్వంతరంలో 'వికుంఠ' అనే ఆమెనుండి అవతరించినందున విష్ణువు "వైకుంఠః" (వైకుంఠుడు) అయ్యాడు. మరియు జీవులకు నియంత, జీవులకు సాక్షి, భూతముల స్వేచ్ఛావిహారాన్ని అణచేవాడు – అనీ అర్థా లున్నాయి. 'వైకుంఠము' – శ్వేతద్వీపమైన విష్ణుదేవునిస్థానం. పునరావృత్తి లేనిదీ, శాశ్వతమైనదీ అగు విష్ణుదేవునిపరంధామం. జీవులు వైకుంఠుణ్ణి అర్చించి, ఉపాసించి, వైకుంఠాన్ని చేరుటే ముక్తి. శరీరంలోని అన్ని ఇంద్రియాలు, ఇంద్రియ అధిష్ఠాననారాయణుణ్ణి సేవించడమే భక్తికదా!

ఇట వైకుంఠ మంటే పరంధామం. ఏకాదశి అంటే పదకొండు ఇంద్రియాల సమూహం. ఈ 11 ఇంద్రియాలూ వైకుంఠునికి అర్పించబడి, వైకుంఠుణ్ణి అర్చించి, సేవించి, ఉపాసించినపుడే – అవి పవిత్రవంతాలై – వాటిద్వారా సుఖానుభూతి నొందేజీవుణ్ణి వైకుంఠంలో చేరుస్తాయి. కాగా "ఏకాదశేంద్రియాలను వైకుంఠునికి అర్పణం చేసి, వైకుంఠాన్ని చేరి, శాశ్వతముక్తి నొంది, ధన్యులుకండి"– అని బోధిస్తూంది– "వైకుంఠ ఏకాదశి". వికుంఠ మంటే– దెబ్బ తిననిది. ఇంద్రియాలు "వికుంఠాలు" అయినపుడే వైకుంఠ సమర్చన ప్రశాంతంగా జరుగుతుంది. ద్వాదశి–12వస్థితి. ఇదే ఇంద్రియాతీతదివ్యానందస్థితి.

## విశేషపూజలు

వైకుంఠఏకాదశినాడు ఉభయనాంచారులతో మలయప్పస్వామి సర్వాలంకారభూషితుడై తిరువీథుల్లో స్వర్ణరథంపై ఊరేగుతారు. ఆనాడు శ్రీవారిసన్నిధిలో "రాపత్తుతొడక్కం" జరిగి, శ్రీనమ్మాళ్వార్‌వారు సాయించిన "భగవద్విషయం" అనే అపరనామధేయాంకమైన "తిరువాయ్‌మొళి" అనే దివ్యప్రబంధంలోని నాల్గవఆయిరం అధ్యయనం ప్రారంభిస్తారు. వైకుంఠద్వారంద్వారా ఈనాడు వేలకొలదిభక్తులు శ్రీస్వామివారిని దర్శిస్తున్నందున ఈ ఉత్సవాన్ని **"వైకుంఠద్వారస్థ భగవదాలోకనమహోత్సవం"** గా కీర్తిస్తున్నారు. ద్వాదశినాటి చక్రస్నానంతో – తామూ స్నానంచేసి, భక్తులు వైకుంఠఏకాదశీవ్రతఫలాన్ని పరిపూర్ణంగా పొందుతున్నారు.

ఏకాదశినాటి ఉపవాసం సత్త్వగుణానికి సంకేతం. ఒకవస్తువుకు మిక్కిలి దగ్గరగా మరొకవస్తువు నుంచినపుడు మొదటివస్తువుయొక్కగుణం, వాసన రెండోదానిపై ప్రభావం చూపుతాయి కదా! అట్లే ఏకాదశేంద్రియాలతోకూడిన జీవాత్మ, వైకుంఠునికి–ఉప= సమీపంలో, వాసః=నివసించడంవల్ల అత్యంతసామీప్య, సాన్నిధ్యప్రభావం కారణంగా జీవాత్మపై పరమాత్మ ప్రభావం ప్రసరిస్తుంది. జీవుడు శుద్ధుడవుతాడు. ద్వాదశినాడు చక్రస్నానం గావించి,

స్వామిప్రసాదాన్ని స్వీకరించడంతో ద్వాదశాక్షరీమంత్రమయమైన వాసుదేవతత్త్వాన్ని అనుభవిస్తాడు – జీవాత్మ. ఈ అనుభవమే కలియుగవైకుంఠమైన తిరుమల–శ్రీపుష్కరిణిలో ముక్కోటిఏకాదశీ చక్రస్నానఫలం.

ఇది ధనుర్మాసం! "ప్రణవో ధనుః" అనుటచే ఓంకారమే ధనుస్సు. శ్రీవారిని ప్రణవమూర్తిగా ఉపాసించుటే ధనుర్మాస పూజ. అందు 'వైకుంఠఏకాదశి' సర్వసమర్పణరూపమైన త్యాగానికీ, శుద్ధసత్త్వగుణానికీ సంకేతం. స్వామి 'పవిత్రాణాం పవిత్రం, మంగళానాం మంగళం' కదా! అట్టి సుదర్శనరూపుని చేతిదివ్యాయుధం – సుదర్శనచక్రం. ఇది కాలచక్రానికీ, దర్శన మాత్రంతోనే ముక్తినిచ్చేందుకూ ప్రతీక. సుదర్శనచక్రస్నానస్పర్శతో కూడినజలంలో (పుష్కరిణీతీర్థంలో) స్నానంచేయడంతో జీవాత్మలు పరిశుద్ధులూ, 'సుదర్శనులూ' అవుతారు. ఇట్టి జీవులకు వైకుంఠద్వారాలు–ఒకరోజే కాదు–సర్వదా తెరువబడే ఉంటాయి.

ఇంతటి ప్రభావసంపన్నమైన వైకుంఠ ఏకాదశినీ, ద్వాదశినీ భక్తిశ్రద్ధలతో ఆచరించినవారికి పునర్జన్మ ఉండదు.

## కలియుగ వైకుంఠంలో.....

తిరుమల – శ్రీవారిఆలయంలో వైకుంఠఏకాదశి మహావైభవంగా నిర్వహింపబడుతుంది. ఈ ఏకాదశికి ముందురోజు అనగా దశమినాటిరాత్రి ఏకాంత సేవానంతరం బంగారువాకిళ్లు మూసేస్తారు. తర్వాత తెల్లవారుజామున వైకుంఠఏకాదశినాడు సుప్రభాతం మొదలుకొని, మరునాడు ద్వాదశిరాత్రి ఏకాంతసేవ వరకూ శ్రీవారిగర్భాలయానికి ఆనుకొని ఉన్న ముక్కోటిప్రదక్షిణ మార్గాన్ని తెరచి ఉంచుతారు. ఈ ఏకాదశీ, ద్వాదశీ రెండు రోజులూ శ్రీవారిదర్శనానంతరం భక్తులు ముక్కోటిప్రదక్షిణ మార్గంలో వెళ్తారు. ఈ ముక్కోటిప్రదక్షిణప్రవేశద్వారాన్ని **వైకుంఠ ద్వార** మనీ, ఆ మార్గాన్ని **వైకుంఠప్రదక్షిణ** మనీ అంటారు.

వైకుంఠఏకాదశీపర్వదినంనాడు ముక్కోటిప్రదక్షిణమార్గం రంగురంగుల విద్యుద్దీపాలతో, పూలమాలలతో మనోహరంగా అలంకరించబడుతుంది. శ్రీస్వామివారికి అత్యంతసమీపంలో ఉన్న ఈప్రదక్షిణమార్గంలో దర్శనానంతరం వెళ్లినభక్తులు ఒక విశిష్ట ఆశ్చర్య దివ్యానుభూతిని అనుభవిస్తారు.

## వైకుంఠద్వాదశి

వైకుంఠ ఏకాదశి మరునాడు – ద్వాదశి. ఆ రోజు సూర్యోదయవేళ **"శ్రీస్వామిపుష్కరిణీతీర్థకోటి"** జరుగుతుంది. వైకుంఠ ఏకాదశినాడు ముల్లోకాల్లో ఉన్న 3 కోట్ల, 50 లక్షలపుణ్య తీర్థాలూ, పుష్కరుణులూ తిరుమలలోని 'శ్రీస్వామిపుష్కరిణి'లో దివ్యసూక్ష్మరూపంతో లీనమై ఉంటాయి. అందే సర్వదేవతలూ సన్నిధిచేసి ఉంటారు. కనుక ఈ పండుగరోజు శ్రీవారిఆలయంలో శ్రీవారికి సుప్రభాతం, తోమాలసేవ, అర్చన, నివేదనాదులు యథాశాస్త్రంగా జరుగుతాయి. పిదప ఆనందనిలయంలో ఉన్న **'సుదర్శనచక్రత్తాళ్వార్'** పల్లకిని అధిరోహించి, ఊరేగింపుగా తిరుమల తిరువీథుల్లో మహాప్రదక్షిణంగా వచ్చి, శ్రీవరాహస్వామిఆలయప్రాంగణం చేరుకొంటారు. అక్కడ 'చక్రత్తాళ్వార్'కు అభిషేకం జరిగినతర్వాత పుష్కరిణిలో పవిత్ర స్నానం చేయిస్తారు. ఇలా చక్రస్నానం జరిగేసమయంలో అసంఖ్యాకభక్తులుకూడా పుష్కరిణిలో మునిగి, పవిత్రస్నానం చేస్తారు. తర్వాత చక్రత్తాళ్వార్‌కు వస్త్రాలంకారం, నివేదన, హారతులు ఘనంగా నిర్వహిస్తారు. అటనుండి చక్రత్తాళ్వార్‌వారు (సుదర్శనభగవానులు) బయలుదేరి, ప్రదక్షిణంగా వేంచేసి, శ్రీవారిఆలయాన్ని ప్రవేశిస్తారు.

తిరుమల శ్రీస్వామిపుష్కరిణిలో సంవత్సరంలో నాల్గుమార్లు చక్రస్నానం జరుగుతుంది.

1) భాద్రపదశుద్ధచతుర్దశి– అనంతపద్మనాభవ్రతంనాడు.
2) 10 రోజులు జరిగే బ్రహ్మోత్సవాలలో చివరిరోజు.
3) వైకుంఠఏకాదశి మరునాడు ద్వాదశినాటిఉదయం.
4) రథసప్తమినాటిమధ్యాహ్నం.

ఈ నాల్గింటిలో వైకుంఠద్వాదశినాటిఉదయం జరిగే చక్రస్నానంలో భక్తులు అసంఖ్యాకంగా పాల్గొంటారు. ●

# చరిత్రలో.... తిరుచానూరు

– ఆచార్య గల్లా చలపతి

**తిరుపతికి ఐదుకిలోమీటర్ల దూరంలో ఆగ్నేయంగా, సువర్ణముఖి ఉత్తరపుఒడ్డున తిరుచానూరు ఉంది.**

అలమేలుమంగ తిరుచానూరులో పద్మావతీఅమ్మ వారుగా పూజలందుకొంటూ భక్తుల్ని అనుగ్రహి స్తూంది. తిరుచానూరులో ప్రాచీనకాలంలో శ్రీశుకమహర్షి ఆశ్రమం ఉండడంవల్ల ఆ గ్రామానికి శ్రీశుకనూరు (శ్రీశుక గ్రామ) అని పేరు ఏర్పడింది. అదే క్రమంగా తిరుచ్చోగినూరు (శ్రీ=తిరు), తిరుచ్చుకనూర్ అని రూపాంతరాలు పొందుతూ, తిరుచానూరుగా స్థిరరూపం పొందిందనీ తెలుస్తూంది. ఈ పేర్లన్నీ శాసనాల్లో కనిపిస్తున్నాయి. ఇక్కడ దొరకిన పల్లవుల కాలంనాటి శాసనాల్నిబట్టి తిరుచానూరు పల్లవులపాలనలోని తిరువేంగడ కొట్టానికి చెందిన కుడవూర్‌నాడులోని ఒక గ్రామంగా కని పిస్తూంది.

**చరిత్ర విషయం**

తిరుచానూరుగ్రామం తిరుపతికి ఐదుకిలోమీటర్ల దూరంలో ఆగ్నేయంగా సువర్ణముఖిఉత్తరంఒడ్డున ఉంది. పల్లవుల కాలంనుండి ఈ ఊరు చరిత్రలో కనిపి స్తూంది. చోళులకాలంలోని శాసనాలలో తిరుచానూరులో ఒకసభ (పాలన కేంద్రం) ఉండినట్లు – స్థానికపాలన, ఆలయవ్యవ హారాలు ఈ సభద్వారా జరుగుతూ ఉండి నట్లు – శాసనాలు చెపుతున్నాయి. అప్పటికి తిరుమల ఆలయం అంత ప్రసిద్ధి పొందలేదు. పూజావ్యవహారాలుమాత్రం జరు గుతూ ఉండేవి. కొండపైకి వెళ్లడానికి తగినసౌకర్యాలు ఏర్పడక పోవడంతో కొందరుమాత్రమే వెళుతూఉండేవారు. ఆ కారణం వల్ల తిరుచానూరులోనే ఒక దేవాలయం నిర్మించి, అందులో శ్రీనివాసునికి ప్రతిరూప మనదగిన విగ్రహం పెట్టి, భక్తులు పూజించుకొనే అవకాశం కల్పింపబడి నట్లు–క్రీ.శ.తొమ్మిదవ శతాబ్దానికి ముందు వెలువడిన తమిళశాసనాలు పేర్కొంటు న్నాయి. పల్లవరాణి సమవాయికూడా శ్రీనివాసుణ్ణి ఇక్కడనుండే ఆరాధించింది. ఇప్పుడు శోభిల్లే శ్రీపద్మావతీఅమ్మవారి ఆలయంగా పేరుపొందిన తిరుచానూరు ఆలయాన్ని పరిశీలిస్తే ఆలయప్రాంగణంలో సుందరరాజపెరుమాళ్‌దేవాలయం, శ్రీకృష్ణ



## తిరువిళంగోయల్

పల్లవుల కాలంలో శైవాలయంగా ఉండి, వీళ్ల తర్వాత ఈ ప్రాంతంమీద ఆధిపత్యం పొందిన చోళులకాలంలో వైష్ణవాలయంగా గుర్తింపుపొందింది. చోళులు శైవులైనా - వైష్ణవాన్నికూడా కొంత వరకు ఆదరించారు. పల్లవచోళుల రాజకీయ ఘర్షణల కారణంగా ఇక్కడికి వచ్చే భక్తులసంఖ్య తగ్గింది. ఆలయఆదాయం తగ్గింది. చోళరాజులైన మొదటి పరాంతకుడు (907-955), మొదటి రాజరాజు (985- 1014), మూడవరాజేంద్రుడు (1216-1260) తమ నిధులద్వారా ఈ ఆలయపరిస్థితిని చక్కబరిచారు.

తిరుమలఆలయానికి అనుబంధంగా ఉండిన ఆలయం ఇదే! అప్పటివరకు కొద్దిగానైనా వైష్ణవాదరణ గలిగిన చోళులు శైవాలయాల నిర్మాణం చేపట్టారు. ఆ కోవలో చేరువలోని యోగిమల్లవరంలో పరాశరేశ్వరుని ఆలయనిర్మాణం చేపట్టారు. క్రమంగా చోళుల ఆధిపత్యం తగ్గి, ప్రాంతీయపాలకులు అధికారంలోకి వచ్చారు. వీళ్లు తిరుమలఆలయంలో భక్తులకు కావలసిన సౌకర్యాలు కలిగించే ప్రయత్నం చేశారు. పూజాదికాలు విస్తరించారు. అందువల్ల తిరుమలకు భక్తులు అధికంగా రాసాగారు. వైష్ణవులు తమ కార్యకలాపాలను తిరుమలకు మార్చారు. ఈ కారణాలవల్ల తిరుచానూరులోని తిరువిళంగోయల్ ఆదరణ లేక పూర్తిగా పతనమైంది.

దేవాలయం, పద్మావతీదేవాలయం కనిపిస్తున్నాయి. కానీ, పల్లవుల, చోళులకాలంలో భక్తులకోసం తిరుమల శ్రీనివాసునిప్రతిరూప మనదగిన విగ్రహాన్ని ప్రతిష్ఠించిన దేవాలయం కనిపించడం లేదు. ఆ ఆలయం పూర్తిగా శిథిలమైపోయింది. ఈ విషయాన్ని ఇరవయ్యో శతాబ్ది ప్రారంభంలో ఒక ప్రభుత్వశాసన పరిశోధకుడు 1904వ సంవత్సరపు వార్షికనివేదికలో పేర్కొన్నాడు.

కుంఫిణి ప్రభుత్వం 21-4-1843లో తిరుమల ఆలయాన్ని, అనుబంధ ఆలయాలను హథిరాంజీ మఠానికి అప్పగించింది. తర్వాత ఆయా దేవాలయాల ప్రాచీన విషయాలను సేకరించడానికి 'ప్రెసిడెన్సీ' ఉద్యోగులు ప్రయత్నించారు. ఆ సందర్భంలో వెంకయ్య 1-6-1904లో తిరుచానూరు ఆలయంనుండి సేకరించిన విషయాల్ని ప్రభుత్వప్రధానకార్యదర్శికి పంపడానికి తయారుచేసిన నివేదికలోని విషయాలు ఆసక్తికరంగా ఉన్నాయి. చారిత్రకవిషయాలే కాక వెంకయ్యకాలంవరకు ప్రచారంలో ఉండిన విషయాలుకూడా ఈ నివేదికలో ఉన్నాయి. తిరువిళంగోయిల్ పెకలింపబడిన తర్వాత కొంతకాలానికి పద్మావతీఅమ్మవారిఆలయనిర్మాణం జరిగినట్లు వెంకయ్య

## శ్రీకృష్ణాలయం

దీనికి అళగియపెరుమాళ్ దేవాలయంగా శాసనాల్లో పేరుంది. చోళరాజైన మూడవరాజరాజు (1216-1260) కాలంలో 1221వ సం॥లో పొక్కిరాన్ అనే ఒక భక్తుడు శ్రీకృష్ణునికి పంగుణి ఉత్సవ నిర్వహణకోసం కొంతభూమి దానం చేసినట్లు ఒక శాసనముంది. దీన్నిబట్టి ఈ ఆలయం 13వ శతాబ్ది ఆరంభంలో నిర్మింపబడినట్లు చెప్పవచ్చు. చోళుల సామంతులు, వైష్ణవాభిమానంకలవారు అయిన యాదవరాజులకాలంలో ఈ ఆలయం చోళశైలిలో నిర్మింపబడింది. ఇప్పుడున్న ఆలయప్రాంగణంలో మొదటి గోపురం కృష్ణాలయానికి ఎదురుగా నిర్మింపబడి, కనిపిస్తుండడంవల్ల కృష్ణాలయమే మొదటిదిగా కొందరు చెపుతున్నారు.

## సుందరరాజ పెరుమాళ్ ఆలయం

ఈ ఆలయం శ్రీకృష్ణాలయానికి దక్షిణంవైపు తూర్పు ముఖంగా ఉంది. ఈ ఆలయవాస్తునిర్మాణం విజయనగరశైలిలో ఉండడంవల్ల ఇది 16వ శతాబ్ది ప్రారంభంలో నిర్మింపబడినట్లు భావించవచ్చు. అచ్యుతరాయలకాలంనాటి ఒకశాసనంలో శెత్తులూరి శ్రీనివాసయ్య అనే ఒక భక్తుడు ఈ స్వామికి నాలుగు దోశెపడులు సమర్పించిన విషయముంది. సదాశివరాయల కాలంనాటి మరొకశాసనంలో ఈ ఆలయానికి సంబంధించిన బ్రహ్మోత్సవం, అధ్యయనోత్సవం, ఉగాది, దీపావళి ఉత్సవాలు, తెప్పోత్సవాలు పేర్కొనబడినాయి. స్థానికంగా ఈ స్వామిని వరదరాజస్వామి అనడంకూడా ఉంది. స్వామికి ఎదురుగా ముఖమండపం వెలుపల గరుడాళ్వార్ సన్నిధికూడా ఉంది.



అభిప్రాయం. ఎప్పుడు నిర్మింపబడిందో తెలుసుకోవడానికిముందు ఈ ఆలయ ప్రాంగణంలో ప్రాచీనకాలంనుండి ఎన్ని ఆలయాలు ఉండేవో తెలియడం అవసరం.

ఇక పద్మావతీ అమ్మవారి ఆలయ నిర్మాణం ఎప్పుడు జరిగిందో పరిశీలించాలి. ఈ ఆలయనిర్మాణాన్నిగురించి చెప్పడానికి శాసనాధారాలు లేవు. తిరుమల, తిరుపతి, తిరుచానూరు ప్రాంతాలలో మనకు దొరకి, ముద్రింపబడిన సుమారు 13వేల తి.తి.దే. శాసనాలలో ఏ ఒక్కశాసనమూ అమ్మ వారినిగురించి కానీ, అమ్మవారిదేవాల యాన్నిగురించి కానీ, పేర్కొన లేదు. తేదీ లేని ఒక శాసనం అమ్మవారిబ్రహ్మోత్సవాల తొమ్మిదవరోజుకు సంబంధించిన తీర్థవారిని (పంచమి) పేర్కొన్నది. అమ్మనుగురించి

## పద్మావతీ అమ్మవారి ఆలయం

ఎప్పుడు నిర్మింపబడిందో సరిగా తెలియని ఈ ఆలయం శ్రీకృష్ణ దేవాలయానికి ఉత్తరంగా తూర్పుముఖంగా ఉంది. ఆలయవాస్తునిర్మాణాన్ని బట్టి ఇది 17వ శతాబ్దిలో నిర్మింపబడి ఉంటుందని చెప్పవచ్చు. ఆలయ వాస్తుశిల్పం 17వ శతాబ్దికి చెందన విజయనగరశైలిని పోలిఉండడం దీనికి కారణం. 16వ శతాబ్ది ప్రారంభంలో శ్రీనివాసమంగాపురంలో కల్యాణవేంక టేశ్వరస్వామిఆలయనిర్మాణం జరిగింది. భక్తులు తిరుపతినే ప్రధాన కేంద్రంగా భావించడంవల్ల దగ్గరగా ఉన్న తిరుచానూరుకే ఎక్కువగా వెళుతూ ఉండేవారు. శ్రీనివాసమంగాపురానికి తక్కువగా వెళ్లేవారు. అప్పటికే తిరుచానూరులో రెండుదేవాలయాలుండడంకూడా దీనికి కారణం. యాత్రికులను ఎక్కువగా ఆకర్షిస్తున్న తిరుచానూరులోనే అమ్మవారికి ఒకఆలయం నిర్మించాలనే సంకల్పం ఎవరికి కలిగిందో తెలియదు కాని ఆలయం కట్టబడింది. ఆలయంలో అమ్మవారు పద్మంమీద పద్మాసన భంగిమలో కొలువై ఉంది. నాలుగుచేతులలో – పై రెండుచేతులు పద్మాలను ధరించి కనిపిస్తున్నాయి. కిందిచేతులలో కుడిచేయి అభయముద్రలో, ఎడమచేయి వరదముద్రలో ఉన్నాయి.

అమ్మవారి గర్భగృహానికి ఎదురుగా ఉన్న ముఖమండపంలో దక్షిణంవైపున ఉత్తరముఖంగా చిన్న విష్వక్సేనులసన్నిధి ఉంది. ముఖమండపం ఉత్తరంవైపున దక్షిణముఖంగా రామానుజులవారిసన్నిధి ఉంది. దేవాలయప్రహరిగోడకు వాయవ్య భాగంలో పద్మసరోవరం (పుష్కరిణి) ఉంది. సరోవరం మధ్యలోని నీరాళిమండపం విజయనగరనిర్మాణశైలిలో కనిపిస్తున్నది.

తిరుచానూరికే అలమేలుమంగాపుర మని మరొక పేరుంది. ఇక్కడి దేవాలయంలో 'శాంతినిలయం' అనే బంగారుగోపురంలో పద్మావతీదేవి అర్చామూర్తిగా దర్శనమిస్తూ, భక్తులను అనుగ్రహిస్తూ ఉంది. ఇక్కడ అర్చామూర్తిగా ప్రతిష్ఠింపబడక ముందు అమ్మవారు స్వామివారి'వక్షఃస్థలనిత్యవాసరసిక' గానే పూజలందుకొన్నది. తిరుమల ఆలయంలో అన్నమయ్యకు విగ్రహరూపంలో కనిపించిన ఈ తల్లికి– ఆయనకు సుమారు నూటఏభైసంవత్సరాల తర్వాత – తిరుచానూరులో ప్రత్యేకంగా ఒక ఆలయం ఏర్పడింది. ఈ ఆలయప్రాంగణంలోని శ్రీకృష్ణ, సుందరరాజస్వామి దేవాలయాలతో పోల్చిచూస్తే అమ్మవారిఆలయం కొత్తగా కనిపించడంవల్ల దీనిని శాసనపరిశోధకు డైన వెంకయ్య 18వ శతాబ్ది ప్రారంభంలో వచ్చినట్లు ఊహించాడు. ఇంకా కొంతముందే ఈ ఆలయనిర్మాణం జరిగినట్లుంది.

చెప్పిన శాసనాలు ఏవైనా ఉంటే – అవి శ్రీవారివక్షఃస్థలంమీద ఆమెఉనికినిగురించే చెప్పాయి. గోవిందరాజస్వామి ఆలయంలో దొరకిన ఒక తేదీ లేనిశాసనం తిరుచానూరులోని పద్మసరస్సు గురించి చెప్పిందేకాని అమ్మవారిఆలయాన్ని పేర్కొనలేదు. 17వ శతాబ్దంనుండి శాసనాలు వేయడం బాగా తగ్గిపోయింది. ఈ కాలానికి ముందే ఈ ఆలయం ఉంటే – శాసనాలు తప్పకుండా పేర్కొనేవే. అందువల్ల అమ్మవారిఆలయం సుందరరాజ పెరుమాళ్, శ్రీకృష్ణఆలయాల నిర్మాణం తరువాతనే వచ్చి ఉంటుంది. ఈ సందర్భంలో 'అన్నమాచార్యచరిత్ర'లోని దీనికి సంబంధించిన విషయాన్ని తెలుసుకోవడం అవసరం.

**అన్నమయ్య విషయం**

చిన్నన్న రచించిన అన్నమాచార్యచరిత్రలో పరసజనంవెంట తిరుమలకు చేరిన అన్నమయ్య దేవాలయంలోపలికి వెళ్లి, భాష్యకారులను, నరసింహస్వామిని, జనార్దనుని, అలమేలు మంగను దర్శించి, నమస్కరించాడు. అలమేలుమంగ మూర్తికి చెంగట (సమీపం) గల యాగశాలను కీర్తించాడు. చిన్నన్న అనేకమార్లు ఆలయంలో తిరిగినవాడు. ఆయన వర్ణించిన దేవతామూర్తులవరుస ఆయనకాలంలో అలాగే ఉందనేది వాస్తవం. అలమేలుమంగమ్మను దర్శించిన తర్వాత అన్నమయ్య యాగశాలను కీర్తించినట్లు చిన్నన్న చెప్పడంవల్ల అమ్మవారిమూర్తి యాగశాలముందే ఉన్నట్లు అర్థమవుతూంది. అలాకాకుండా స్వామివారివక్షఃస్థలంపై గల అమ్మవారిని అన్నమయ్య దర్శించాడని చెప్పడానికి వీలు లేదు. ఎందుకంటే అప్పటికి అన్నమయ్య స్వామిని దర్శించనే లేదు. స్వామిని దర్శిస్తే కదా ఆమె కనిపించేది!

శ్రీనివాసుని వక్షఃస్థలంలో ముందుకు ఉబ్బెత్తుగా పద్మం మీద కొలువైనట్లున్న అమ్మవారు కనిపిస్తారు. స్వామివక్షఃస్థలంపై వస్త్రం కప్పడంవల్ల, ఆభరణాలతో, పుష్పాలంకారాలతో కూడి ఉండడంవల్ల అలమేలుమంగమ్మను భక్తులు ప్రతిరోజూ దర్శించుకోవడానికి వీలుగాక– శుక్రవారాభిషేకసమయంలో మాత్రమే దర్శించే వీలున్న సంగతి రామానుజాచార్యులవారు గమనించారు.

అమ్మదర్శనం అన్నిసమయాల్లో భక్తులకు కలిగించే ఉద్దేశంతో ఆయన బంగారుఅలమేలుమంగమ్మప్రతిమను తయారు చేయించి, స్వామిహృదయంపైన కుడివైపున అలంకరింపజేశారు. అలమేలుమంగమ్మ అనగానే స్వామిహృదయం మీద అధివసించిన అమ్మే గుర్తుకు రావడం మొదలైంది. స్వామివారి వక్షఃస్థలంమీద అనపాయినిగా ఉండిన పద్మావతీఅమ్మవారిని భక్తులు వేరు చేసిచూడడంకూడా అప్పట్లో కొందరికి ఇష్టం లేనట్లుంది.

చిన్నన్న చెప్పిన తీరును బట్టి తాళ్లపాక అన్నమయ్య అభినందనలు సమర్పించిన అమ్మ స్వామివక్షఃస్థలంపై గల అమ్మ కాదనిపిస్తున్నది.

అన్నమయ్య దర్శించిన అమ్మ అప్పటి యాగశాలకు తూర్పువైపున ఉండి ఉండ వచ్చునని తోస్తూంది. అన్నమయ్యకాలంనాటికి తిరుచానూరులో అమ్మవారి ఆలయం లేదు. ఉంటే ఆయన తిరుచానూరు అమ్మను సంకీర్తనలలో కీర్తించకుండా ఉండడు.

అయితే అన్నమయ్య దర్శించిన అమ్మమూర్తినిగురించి శాసనాలు మాట్లాడలేదు. మరే ఇతరఆధారమూ కనిపించడం లేదు. అలా అని అన్నమయ్య దర్శించింది స్వామివక్షఃస్థలంపైన గల అమ్మ అనడానికీ వీలులేదు. అన్నమయ్య జీవించింది విజయనగరరాజులకాలం. ఆ కాలంలో దేవాలయంలో ఎన్నో మార్పులు జరిగి ఉంటాయి. ●

తాళ్లపాక అన్నమాచార్యుల మనుమడు, పెదతిరుమలాచార్యుల నాల్గవకుమారుడు చిన్నతిరువేంగళనాథుడు. ఇతనికే 'చిన్నన్న' అని నామాంతరం. చిన్నన్న రచనలు. అన్నమాచార్యచరిత్ర, అష్టమహిషీకల్యాణం, పరమయోగివిలాసం, ఉషాపరిణయం. ఇవన్నీ ద్విపదఛందస్సులో వ్రాయ బడ్డ రచనలు.

పరమయోగివిలాసం ఆళ్వారుల, ఆచార్యుల, వైష్ణవభాగవతుల చరిత్రలను విశదీకరించే వైష్ణవకృతి. "తెలుగు వైష్ణవ సాహిత్య సౌరభమును చవిజూపిన పుణ్యపురుష జీవితకథా స్రగ్గథిత దివ్యసుమదామం" - 'పరమ యోగివిలాసం'. ఇది ఎనిమిదిఆశ్వాసాల గ్రంథం.

నేటి పాఠకలోకానికి తగినట్లు సరళంగా, సుందరంగా, మూల విధేయంగా వచనరూపంలో ఆచార్య కె.సర్వోత్తమరావు ధారావాహికగా ఈ నెలనుండి అందిస్తున్నారు. ఈయన ఐదుదశాబ్దాలుగా తాళ్లపాక సాహిత్యంలో విశేషకృషి చేసి, అనేక గ్రంథాలు రచించారు.

ఈ సంచికనుండి ధారావాహికగా 'పరమయోగి విలాసం'
సప్తగిరి (తెలుగు) మాసపత్రికలో వెలువడుతుంది.

- ప్రధానసంపాదకుడు




ఆదివో తిరుమల!

నూటెనిమిది దివ్యతిరుపతులకు తలమానికమైన శ్రీవైష్ణవక్షేత్రం. కలియుగ వాసుల్ని కరుణించడంకోసం శేషాద్రిపై సాక్షాత్కరించిన శ్రీనివాసక్షేత్రం. కమనీయ రమణీయాకృతితో కల్యాణకల్పద్రుమంగా నిలిచిన శ్రీవేంకటేశ్వరుణ్ణి కనులార దర్శింపగలిగే కైవల్యధామం. అండపిండ బ్రహ్మాండాలను, చరాచరజీవకోటిని రక్షించే నిమిత్తం అర్చావతారమూర్తిగా ఆవిర్భవించిన ఆదినారాయణక్షేత్రం. నిత్యోత్సవ, వారోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, అయనోత్సవ, సంవత్సరోత్సవాదులతో వైభవంగా వెలిగేవైకుంఠం. ఈ విష్ణునివాసంలో ఆ వేళ శ్రవణనక్షత్రోత్సవం. స్వామివారితిరు నక్షత్రం. అట్టి శుభనక్షత్రంలో శ్రీనివాసుణ్ణి దర్శించడానికి పరితపించేవాళ్లెందరో? ఉరుకుపరుగులతో, ఉత్సాహంతో ఆలయం కేసి బిరబిరా ముందడుగు వేస్తున్నవారెందరో?

స్వామిపుష్కరిణిలో పవిత్రస్నానం చేసి, ద్వాదశోర్ధ్వపుండ్రాలు ధరించి, అనుష్ఠాన కార్యక్రమాలు ముగించుకొని, గోవిందనామస్మరణతో మహాద్వారంవైపు నెమ్మదిగా అడుగులు వేస్తున్నవారిలో ఒకరు తిరువేంగళనాథులు. ప్రధానగోపురానికి చేతులుజోడించి, మహాద్వారం లోపలిభాగాన గోడపై వేలాడుతున్న అనంతాళ్వాన్ గునపానికి నమస్కరించి, గరుడస్తంభం చుట్టి, వెండివాకిలి దాటి, మహామణిమంటపం ప్రవేశించి, గరుడాళ్వారువద్ద తలవంచి, ద్వారపాలకుల అనుమతితో గర్భాలయం కులశేఖరప్పడి దగ్గర నిలిచి, శ్రీయుతాకారుని ఆకర్షకమూర్తికి అంజలి ఘటించి, ప్రదక్షిణమార్గం చుట్టి

వస్తూ 'భాష్యకారుల సన్నిధి' దగ్గర ఆగారు– తిరువెంగళ నాథులు. తాతగారు మైమరచి పాడిన –

**గతులన్ని ఖిలమైన కలియుగమందున**
**గతి యీతడే చూపె ఘనగురుదైవము**

అనే కీర్తన మనసులో మెదలింది. శ్రీవైష్ణవోచితంగా నమస్కారాలు అర్పించి, యోగనారసింహులకు దండం పెట్టి, ఆలయంబయటికి వచ్చారు. ఆలయంఎదురుగా ఎక్కడ చూచినా శ్రీవైష్ణవులే! ఊర్ధ్వపుండ్రధారులే! ధౌతధవళవస్త్రధారులే! శ్రీనివాస స్మరణంతో ఆలయంవైపు వస్తున్న భక్తజనసమూహం సందడే... సందడి!

ఈ సందడినీ, సమూహాన్నీ గుర్తిస్తూ తిరువేంగళనాథులు స్వగృహం చేరుకొన్నారు. అయినా వారికళ్లముందు భగవద్రా మానుజుల 'తిరుమేని', తాతపాట స్మృతిపథంలో మెదలు తున్నాయి. అన్నిటికన్నా తాతగారిపాటలో.. 'ఈతని కరుణనెకా యిల వైష్ణవులమైతి (మి)' వాక్యం–తన్నేదో ప్రశ్నిస్తున్నట్టు అనిపించింది.

"అవును. వైష్ణవుడయినందుకు, ఆ వైష్ణవానికీ, వైష్ణవ ప్రచారానికీ ఏమీ చేయలేదే?" అనే ఆందోళన మొదలయింది.

"తాతగారిలాగ, తండ్రిగారిలాగ సంకీర్తనలు వ్రాయ లేదు. సోదరుడు చినతిరుమలయ్యలాగా కృతులు రచించలేదు. ఊరూరు తిరిగి వైష్ణవప్రచారమూ చేయలేదు. నా జీవితం వ్యర్థమైంది. ఏం చెయ్యాలో పాలుపోవడం లేదు" అంటూ కలవరపడ్డాడు. సరిగ్గా అదే సమయంలో పూజాగృహంనుండి తిరుఘంటల రవళితో..

**లక్ష్మీనాథసమారంభాం నాథయామునమధ్యమామ్**
**అస్మదాచార్యపర్యంతాం వందే గురుపరంపరామ్ ॥**

– అనే గురుస్తుతి చెవుల సోకింది.

తిరువేంగళనాథులు చటుక్కున లేచారు. పూజగది వైపు నడిచారు. స్వగృహంలోని అలమేల్మంగా సహిత శ్రీవేంకటేశ్వరుల మూర్తులను తదేకంగా చూచి, ధ్యానంలో మునిగారు. కాసే పటికి సర్వం కరతలామలకమయింది.

'అవును. తాత, తండ్రి తలపెట్టిన పవిత్రకార్యానికి శ్రీకారం చుట్టాలి. బహుశః ఇదే దైవసంకల్పం కాబోలు!' తాత, తండ్రులలాగా కీర్తనలు నేను వ్రాయలేదు. వ్రాయనుకూడా! అయినా పాటగా పాడుకోదగిన ద్విపదలతో ఆళ్వారుల, ఆచార్యులచరిత్రలను వ్రాస్తాను. ఆహా! ఏమి నా భాగ్యం! గ్రంథనామంకూడా తాతగారే కీర్తనలలో సూచించారు.

'పరమయోగులకు పరిపరి విధముల వరములొసగెడు' అన్నారు కదా! నా కావ్యానికి తగినపేరు 'పరయోగివిలాసం'. అవును పరమయోగివిలాసం! ఈ పవిత్రతిరునక్షత్రంనాడే విలాస కావ్యానికి శ్రీకారంచుడతాను.

**శ్రీ యలమేల్మంగ చిరకృపాపాంగ**
**తోయజదళనేత్రి తోయధిపుత్రి**
**జలజాతభవమాత జగదేకమాత**

– **తల్లీ! వందనమమ్మా!** దేవాధిదేవసందీప్తప్రభావ 'శ్రీవేంకటాధీశ' జయము జయము! శ్రీభూనీళాపుణ్యాంగనా సేవితమూర్తి శరణు శరణు! శంఖచక్రాదిపంచాయుధములారా! సన్నుతు లివిగో! అనంతగరుడవిష్వక్సేనులార! కరుణార్ద్ర వీక్షణాలతో కనికరించండి. ఆచారవిజితామరాచార్య! శ్రీకరవైష్ణవ సిద్ధాంతవిభవపాకశాసనా! పెదతిరుమలాచార్యజనకా! అను గ్రహించండి.

ఇంతేకాదు. వాధూలగోత్రజులైన వాధూలపతినప్ప గారికి, ప్రసిద్ధవైష్ణవాచార్యులకు, మహాగురువరేణ్యులైన రామానుజులకు, మహాపూర్ణులకు, ఆళవందారులకు, రామ మిశ్రులకు, పుండరీకాక్షులకు, నాథమునులకు, పరాంకుశమును లకు, వేంకటాచలపూర్ణులకు, ఆళ్వారులకు, నిత్యులకు, ముక్తు లకు, అఖిలభాగవతులకు, కురువనంబి, తొండమాన్ చక్రవర్తి కైంకర్యపరులకు, భట్టాచార్యులకు, అనంతాళ్వానులకు, శఠగోప మునులకు, కృష్ణమాచార్యులకు, తాతగారైన అన్నమాచార్యులకు 'అడియేన్' శరణం!

ఆశ్వలాయనసూత్రుణ్ణి, భరద్వాజసగోత్రుణ్ణి, అన్న మాచార్యసుతుడైన పెదతిరుమలాచార్యులతనయుణ్ణీ అయిన నేను

ఒక కావ్యరచనకు సంసిద్ధుడనయ్యా, నని తిరువేంగళనాథుల వారు - గురుపరంపరను, హరిసేవకులను, వంశప్రతిష్ఠులను పేరుపేరున స్తుతిస్తుండగా కలలో శ్రీవేంకటేశ్వరుడు వైష్ణవా కారంతో ముందు సాక్షాత్కరించారు.

"వెంగళనాథ! నీవు భావించినట్లే 'పరమయోగివిలాసం' రచించు. కాసారయోగీంద్రులకథను వినిపించు. అంతేకాదు- సిరికినీ, సపరివారుడనైన నాకూ అంకితమివ్వు. ఈ కావ్యరచనకు ఆకరాలు లేవని ఆందోళనపడకు. ద్రవిడప్రబంధాలను సేకరించి, చదివి అవగతం చేసుకొని, ద్విపదల్లోనే వ్రాయ వయ్యా! నా అనుగ్రహం సదా నీకుంటుంది" అంటూ తాను ఆరగిస్తున్న ప్రసాదాన్ని తిరువెంగళనాథులకు అందించి, అంత ర్ధానులయ్యారు. కల చెదరింది. కలియుగనాథుని సమ్మోదం లభించింది. ఏదో అనిర్వచనీయమైన అనుభూతి! ఇంతవరకు ఎవరూ చేపట్టనిరచన చేయబోతున్నాను కదా! అని సమధికో త్సాహం... అవును. "అలమేల్మంగఅనుగ్రహ ముంటే - ఆనందనిలయునిప్రేరణ నిజమైతే- ఇదెంతపని? మహాసముద్రా నికి వారధి గట్టడానికి శ్రీరామచంద్రులవారు సిద్ధపడినవేళ, మహాపర్వతాలను, వృక్షాలను సముద్రంలో వానరవీరులు పడవేసినవేళ, తానుకూడ సాయం చేస్తానని ఒక ఉడుత ఆకైంకర్యంలో భాగంపంచుకోలేదా? పట్టపుటేనుగులు గంభీరంగా రాజవీథిలో సాగితే- చీమలుకూడా బారులు కట్టి, తమ విధులు పూర్తి చేయడం లేదా! ఆలాగే నేను '**పరమయోగివిలాస**' కావ్యాన్ని రచిస్తా. వేదసారాన్ని ద్రావిడభాషలో సంతరింపజేసిన పరాంకుశులలాగా చెప్పలేకపోయినా - నేను ఆ మహాయోగి వరుల పాదకమలదాసుణ్ణి. వారిమార్గంలో లక్ష్మీదేవి అను గ్రహంతో 'నా నేర్పువిధంగా' అలమేల్మంగాశ్రీనివాసులకు అంకితంగా కావ్యం కొనసాగిస్తాను. నా కావ్యానికి నారదముని యాదవశైలమాహాత్మ్యంలో ఉటంకించిన "కలౌ ఖలు భవిష్యంతి నారాయణపరాయణాః" - వాక్యాలు ఒక ప్రమాణం. ఆలాగే వృద్ధపాద్మంలో శ్రీలక్ష్మీదేవి, సూత్రవతీదేవికి చెప్పిన అంశాలు మరో ప్రమాణం. ఈ ప్రమాణాలతో పరమయోగుల చరిత్రను కావ్యంగా రచిస్తానని చినతిరువేంగళనాథులు కథారంభానికి సిద్ధమయ్యారు.

*(ఇంకా ఉంది)*




# తేడా?

– మల్లాది వెంకటకృష్ణమూర్తి

**కాశీలో త్రైలింగస్వామి గంగానదిమీద కూర్చుని, ధ్యానం చేసుకునేవాడు. ఈ సంగతి తెలిసిన నాటి బ్రిటిష్ అధికారి దాన్ని స్వయంగా చూసే దాకా నమ్మలేదు. గంగానదిలో నీళ్ల మీద హాయిగా పడుకున్న స్వామిని చూసి, ఆ కలెక్టర్ అడిగాడు.**

**"మీరు నీళ్ళమీద తేలగలరు. కాని మేము మునిగిపోతాం. తేడా ఎక్కడ ఉంది?"**

**వెంటనే స్వామి నీళ్ళల్లో రెండు చేతులని ముంచి, ఓ చేత్తో బంగారు కూజానీ, ఇంకో చేత్తో మట్టి కూజానీ బయటికి తీసి చూపించి, అడిగాడు.**

**"ఈ రెంటిలో ఏది ఎక్కువ విలువైంది?"**

**"నిస్సందేహంగా మీ కుడిచేతిలోని బంగారు కూజానే" కలెక్టర్ జవాబు చెప్పాడు.**

**"నా దృష్టిలో ఈ రెండు సమానమే! అదే తేడా!" అన్నాడు - స్వామి.**




**ధనుర్మాసవ్రత విధానాన్ని, నియమాల్ని తెలియజేయండి?**

*- బి.కవిత, కాకినాడ.*

❖ తెల్లవారుజామున నాలుగుగంటలకు ముందే లేచి, స్నానాదులు చేసి, శుచిగా ఆరవేసిన తెల్లనివస్త్రాల్ని ధరించి, శుభకరమైన ఊర్ధ్వతిలకాన్ని పెట్టుకొని, ఇంటిలోని దైవసన్నిధికి చేరాలి.

❖ శ్రీరంగనాథుడు, శ్రీగోదాదేవి లేదా శ్రీకృష్ణుడు, శ్రీగోదాదేవిపటాలను, అర్చామూర్తులను ప్రత్యేకపీఠంపై వేంచేపు చేసి, అలంకరించి, వారిని మనస్సులో నిలుపుకొని, ఆరాధన ప్రారంభించాలి.

❖ అర్ఘ్య, పాద్య, ఆచమనాలను, స్నానాన్ని, చందనాన్ని, సమర్పించి, పుష్పాలతో, తులసీదళాలతో, ప్రీతితో, కేశవాది నామాలతో, శ్రీకృష్ణాష్టోత్తర, శ్రీగోదాష్టొత్తర శతనామావళులతో అర్చన చేయాలి.

❖ ఆ పైన ధూప, దీపాలు, ఆచమనాలు సమర్పించి, పొంగలి నైవేద్యం పెట్టాలి.

❖ 'లక్ష్మీచరణలాక్షాంక...., 'స్వోచ్ఛిష్టమాలికా' అనే రెండు శ్లోకాలతో మంగళనీరాజనం సమర్పించాలి.

❖ తర్వాత, ధనుర్మాసమహావ్రతసేవాకాలం చేయాలి. అనగా ఆళ్వార్, ఆచార్యప్రార్థన, తిరుప్పళ్ళి యెళుచ్చి (శ్రీరంగనాథ సుప్రభాతం), తిరుప్పావై తమిళపాశురాలను, తెలుగు గేయాలను శ్రద్ధగా చదవాలి. 1, 3, 16, 18, 23, 24, 27, 28, 29, 30 పాశురాలను రెండుసార్లు పఠించాలి.

❖ తిరుప్పావైలోని 28 పాశురాలు పఠించిన తర్వాత (అనగా 'కఱవైగళ్' వరకు), అర్ఘ్య, పాద్య, ఆచమనీయాలు సమర్పించి, ప్రత్యేక ఆరగింపు (దధ్యోదనం- ఫలాదులు- ఇంకా విశేషపాశురాలు వచ్చినప్పుడు పులిహోర, చక్కెర పొంగలి భక్ష్యాలు చేయాలి). 1, 3, 16,18, 23, 24, 27, 28, 29, 30 (మొత్తం పది) పాశురాలు విశేషపాశురాలు. 'కరవైగళ్' పాశురంరోజు వ్రతం చేసే కుటుంబాలతో కలసి, 'వనవిహారం' వెళ్లి రావచ్చు.

❖ తాంబూలం సమర్పించిన తర్వాత, నిల్చొని, కర్పూరహారతి వెలిగించి, 'మంగళాశాసన' శ్లోకాలు చదవాలి. మొదట 'అన్ఱివ్వులగం' అనే తిరుప్పావైలోని 24వ పాశురం రెండుసార్లు అనుసంధించాలి.

❖ ఇపుడు సువర్ణమంత్రపుష్పం సమర్పించి, చామరం వీస్తూ శాత్తుమురై పాశురాలు- అనగా 29, 30- 'శిత్తం శిరు కాలే, వంగక్కడల్'- పాశురాలను రెండుసార్లు అనుసంధించాలి. హారతిస్తూనే 'కర్కటే పూర్వఫల్గున్యాం, తులసీ కాననోద్భవామ్। పాండ్యే విశ్వంభరాం గోదాం, వందే శ్రీరంగనాయకీమ్।' అనే శ్లోకాన్ని, 'నీళాతుంగస్తనగిరితటీ' అనే ఆండాళ్ ప్రార్థనశ్లోకాన్ని విన్నపం చేయాలి. తర్వాత నమస్కరించి, మంగళకరమైన మీ కోరికలను మనసుతో విన్నవించాలి.

❖ అనంతరం ఆండాళ్ వాళితిరునామాలను తమిళంలోను, తెలుగులోను మొదటిరెండు పాశురాలనుమాత్రం అనుసంధించాలి. వెంటనే, అందరికీ తీర్థాన్ని, ప్రసాదాలను వినియోగం చేస్తూ, 'సర్వదేశదశకాలే'తో ప్రారంభమయ్యే ఆళ్వారాచార్యుల మంగళాశాసనశ్లోకాలు చదవాలి.

❖ తర్వాత ఆండాళ్వాళితిరునామాల్లోని 3, 4 శ్లోకాలు చదవాలి.

❖ ఇప్పుడు, 'శ్రీగోదాచతుశ్లోకి' అనుసంధించాలి. తుదిగా, 'క్షమాప్రార్థన' శ్లోకాలు చదవాలి.

❖ ఇప్పుడు, 'మంగళము శ్రీరంగమన్నారురాణికిని' అనే మంగళం, 'ఊంజల్‌సేవ' పాట మొ॥ పాడుకోవచ్చు.

స్వామిసన్నిధిలో సాష్టాంగదండప్రణామం (ఆలయంలో అయితే రెండుచేతులు జోడించాలి) చేసి, 'కోయిల్ ఆళ్వార్' తలుపులు వేయాలి. ఈ కార్యక్రమం అంతా ఉదయం ఆరుగంటలలోపే పరిసమాప్తం కావాలి.

❖ మార్గశిరమాసం వచ్చిన రోజునుంచి, ధనుర్మాసం ప్రారంభం అయ్యేవరకు ఈ వ్రతవిధానం బాగా అధ్యయనం చేసి, అన్నిఏర్పాట్లు చేసుకోవాలి. ముందుగా సత్సంగసభ్యులకు, బంధువర్గానికి, ఇరుగుపొరుగులకు, మిత్రులకు, భాగవతోత్తములకు, ఆచార్యులకు ఈ వ్రతసంకల్పాన్ని వినయపూర్వకంగా తెలియజేసి, వారిని ఆహ్వానించాలి.

❖ మొత్తం పదినియమాలు శ్రీ గోదాదేవి తిరుప్పావై రెండో పాశురం – 'వైయత్తువాళ్వీరుగాళ్'లో సూచించారు. ఆ నియమాలు విధిగా పాటించాలి. ఇవి జీవితాంతం పాటిస్తే మరీ మంచిది. ఈ పదినియమాలలో రెండు – నెయ్యి తినకుండా ఉండడం, పాలు త్రాగకుండా ఉండడం. అయితే ఆరాధనపూర్తికోసం పాయసంలో పాలు, పొంగలిలో నెయ్యి ఉపయోగించి, దైవనివేదితప్రసాదంగా తీసుకోవచ్చు. అట్లే అన్నిభోగాలకు, భోగవస్తువులకు దూరంగా ఉండాలి.

❖ విశేషపాశురముల రోజులలో నివేదితభోగాలను ప్రసాద ప్రతిపత్తితో కొద్దిగా చేతిలో ఉంచుకొని స్వీకరించాలి. వ్రతంరోజుల్లో సాత్త్వికాహారాన్ని – వీలైతే ప్రసాదాన్నే మితంగా స్వీకరించాలి.

❖ సాయంకాలం శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రం పఠించి, మీ ఊరిలో జరిగే తిరుప్పావైప్రవచనం విని, రాత్రి ఇంటికి వచ్చి, పెరుమాళ్లకు అర్ఘ్యపాద్యాదికాలు సమర్పించి, ధూపదీపాలు ఇచ్చి, పండ్లు, పాలు ఆరగింపు చేసి, మంగళాశాసనం సమర్పించాలి.



❖ ఈ విధంగా 30 రోజుల శ్రీవ్రతం పూర్తిచేసి, భోగిపండుగ రోజు, ఇంటిలోనే శ్రీగోదాకల్యాణం నిర్వహించాలి. లేదా మీఊరిఆలయంలో జరిగే గోదాకల్యాణానికి వెళ్లి, అక్షతలు, తీర్థప్రసాదాలు స్వీకరించి, ఇంటికి వచ్చి, కల్యాణాక్షతలు కుటుంబసభ్యులకు అందించి, వ్రతపరి సమాప్తి చేయాలి.

❖ ధనుర్మాసం ముందుగాని, తర్వాతగాని కుటుంబసభ్యులు, సత్సంగసభ్యులతో కలిసి, మొదట శ్రీ విల్లిపుత్తూరు, తర్వాత శ్రీరంగం – ఒకేయాత్రలో దర్శించితే– భక్తిశ్రద్ధలతో మనం ఆచరించిన ధనుర్మాసమహావ్రతం సుసంపన్నమౌతుంది. ●



**భగవంతుణ్ణి వేరుగా, మనల్ని వేరుగా భావించినప్పుడు దేవునికోసం చేసేప్రతిపనీ మనకు కష్టంగా, అదనపుభారంగా అనిపిస్తుంది. అలాకాక భగవంతుణ్ణి మన మనుస్సులో స్థిరంగా ప్రతిష్ఠించుకుంటే - ఆయన మనకు బరువు అనిపించడు. బలంగా మారుతాడు.**

**విలువల పతనంవల్ల**
**ఏర్పడ్డ సంక్షోభం**
**ఈనాడు మనిషిని**
**'బ్రతుకు భయం'గా**
**అనుక్షణం బెదిరిస్తున్నది.**

**లక్ష్యాలనూ, విలువలనూ**
**పునః నిర్వచించుకోవటం,**
**ఉద్ధరించుకోవటం,**
**వాటితో వ్యక్తిశీలాన్ని**
**నిర్మించుకోవటంకోసం**
**తీవ్రమైన ప్రయత్నం ఒక్కటే!**

**నేటి సంక్షోభంనుంచి**
**బయటపడే మార్గం.**
**ఆ మార్గంలో,**
**ఆ ప్రయత్నంలోని భాగమే**
**- ఈ శీర్షిక!**

# స్మర వారం వారం

**- ప్రయాగ రామకృష్ణ**




గవంతుణ్ణి అనుక్షణం మనసులో స్మరిస్తూ ఉండం డని సదాశివబ్రహ్మేంద్ర యోగి అన్నారు. మనసుకు నిరంతరం ఏదో ఒకదానితో సఖ్యం కావాలట! ఆ సఖ్యం ప్రాపంచికవిషయాలతో కాకుండా ప్రాణానికీ, శరీరానికీకూడా ప్రభువైన పర మేశ్వరుడితో ఉండాలంటారు. ప్రాపంచిక విషయాలపట్ల సఖ్యతను కలిగి ఉండడం వల్ల అశాంతి కలుగుతుంది. అదే పరమే శ్వరుడితో అయితే జ్ఞానం కలుగుతుంది. జీవన్ముక్తి కలుగుతుంది. కానీ, దేవుడితో స్నేహం చేయడమనేది అంత తేలికైన పని కాదు. ఆయనకంటే ముందు ఆయనకు ఇష్టమైనసజ్జనులతో స్నేహం చేయాలి. వాళ్లసాంగత్యంద్వారా మన గర్వాల్నీ, అతి శయాల్నీ, అహంకారాల్నీ, ఈర్ష్యా అసూ యల్నీ, రాగద్వేషాల్నీ, ద్వంద్వాల్నీ, మోహాల్నీ, మోసాల్నీ, ఆడంబరాల్నీ, పటాటోపాల్నీ మనం వదలించుకోవాలి. మనస్సును నిర్మలంగానూ, నిశ్చలంగానూ ఉంచుకోవాలి. అప్పుడు గానీ - మెల్ల మెల్లగా దేవుడివైపు మొగ్గదు - మనస్సు. అలా మొగ్గినప్పుడే దేవుడికికూడా కొద్ది కొద్దిగా మనమంటే ఇష్టమేర్పడుతూ వస్తుంది.

అసలింతకీ ఈ సజ్జనులు ఎవరు?

ఎవరైతే నిత్యం భగవంతునికరుణకు పాత్రులో, ఎవరు పరబ్రహ్మాసక్తులో వారు సజ్జనులు. వారు ఎక్కడుంటారు? సత్ సంఘాలలో ఉంటారు.

భగవంతుణ్ణి తెలుసుకోగోరేవారూ, సత్యాన్వేషకులూ ఒకచోట చేరితే - అది సత్సంఘం అవుతుంది. మరి ఈ సత్ సంఘాలవల్ల ప్రయోజనమేమిటి?

జ్ఞానం అలవడుతుంది. మనస్సూ, బుద్ధీ పరిశుద్ధమవుతాయి.

తులసీదాస్ రామచరితమానస్‌లో 'సత్సంఘం లేకుండా వివేకం మేల్కోదు. విచక్షణజ్ఞానం కలుగదు. వివేకం, విచక్షణ లేకుండా జీవితంలోని మిట్టపల్లాలను అధిగమించలేం' అంటారు.

అదిశంకరులుకూడా 'ఈ సంసార మనే సముద్రాన్ని దాటడానికి ఉపయోగపడే నౌక - సజ్జనసాంగత్యం ఒక్కటే' అని చెప్పారు. కనుక సత్‌సంఘంతో సత్సంగం ఏర్పడితే జీవితం ప్రశాంతికి నిలయం అవుతుంది.

మనస్సుకు ఎప్పుడైతే పరమాత్మతో సఖ్యం కలుగుతుందో ఆ క్షణంనుంచే శాశ్వతానందం లభిస్తుంది.

'రోజువారీ పనులకూ, పరుగులకే సమయం సరిపోవడం లేదు. ఇక సత్సంఘాలకు వెళ్లే తీరికేది?' అని కొందరంటుంటారు. అయ్యా! అలాంటివాళ్లకు వెయ్యిజన్మలెత్తినా సమయం సరిపోదు. చావుపుట్టుకలచక్రంలో వాళ్లు అలా కొట్టుమిట్టాడ వలసిందే! అయినా సమయం లేకపోవడమేమిటి? భగవంతుణ్ణి వేరుగా, మనల్ని వేరుగా భావించినప్పుడు - దేవునికోసం చేసే ప్రతిపనీ మనకు కష్టంగా, అదనపుభారంగా అనిపిస్తుంది. అలాకాక భగవంతుణ్ణి మన మనుస్సులో స్థిరంగా ప్రతిష్ఠించుకుంటే ఆయనకూ, మనకూ మధ్యదూరం తొలగిపోతుంది. అప్పుడు ఆయన మనకు బరువు అనిపించడు. సరికదా! మనకు బలంగా మారుతాడు.

అమ్మమ్మ దీనికి సంబంధించి, ఓ చిన్నకథ చెప్పింది.

ఓసారి ఒక బాటసారి చాలాదూరం వెళ్లాల్సి వచ్చి, మార్గమధ్యంలో తినడానికి దిబ్బరొట్టెలు, పులిహోర మూటగట్టుకుని ప్రయాణం ప్రారంభించాడు. సగందూరం వెళ్ళేసరికి మట్టమధ్యాహ్నం అయింది. ఎండ మాడ్చేస్తోంది. చెమటతో తడిసి ముద్దయ్యాడు. బాగా అలసిపోయాడు. నెత్తిమీద ఉన్న దిబ్బరొట్టెలు, పులిహోర మూటనుకూడా మోయలేని స్థితికి చేరుకున్నాడు. వెంటనే ఓ చెట్టు కిందకు చేరి, మూటాముల్లె కింద పెట్టి, పక్కనే ఉన్న చెరువులో స్నానం చేసొచ్చి, మూటలోని దిబ్బరొట్టెలు, పులిహోర ఆరగించాడు. మూట ఖాళీ అయింది. ఇప్పుడు మూట బరువుతప్పడమేకాదు - దిబ్బరొట్టెలు, పులిహోర కడుపులో పడేసరికి అలసినశరీరానికి శక్తికూడా వచ్చింది. మిగిలిన సగందూరం ప్రయాణించడానికి కావలసిన బలమూ, ఉత్సాహమూ వచ్చాయి. ఇంతకు ముందు పులిహోరమూట వేరుగా ఉంది. గనుక బరువైంది. అదే కడుపులో పడగానే బలంగా మారింది. అలాగే భగవంతుణ్ణి మూటలా కాకుండా- మనస్సులోనే ప్రతిష్ఠించుకుంటే-దేహమే దేవాలయం అవుతుంది. ఆ శరీరం చేసేపనులన్నీ అర్చనలు అవుతాయి. నిరంతరం భగవన్నామస్మరణ చేస్తుంటే- మనం రోజువారీపనుల్లో ఎంత తలమునకలుగా ఉన్నా భగవంతుడు అదనపుభారంగా కాక - మానసికబలంగా పరిణమిస్తాడు.



నవవిధభక్తిమార్గాలలో సఖ్యభక్తికూడా ఒకటి. లౌకిక జీవితంలో సమానులమధ్యనే స్నేహం నిలుస్తుంది. బలవంతుడికీ– బలహీనుడికీ, ధనవంతుడికీ – పేదవాడికీ, చదువుకున్నవాడికీ – చదువు లేనివాడికీ ఈ ప్రపంచంలో స్నేహం కుదరదు. అందుకే కయ్యానికైనా వియ్యానికైనా సమానత్వం ఉండాలనే – తాహతుండాలనే లోకోక్తి పుట్టింది.

ద్రుపదుడూ, ద్రోణుడూ ఇద్దరూ ఒకేగురువువద్ద విద్యాభ్యాసం చేశారు. బాగా స్నేహంగా ఉండేవారు. తర్వాత ఇద్దరూ విడిపోయారు. ఒకసారి ద్రోణుడు బాల్యమిత్రుడు ద్రుపదుణ్ణి చూడడానికి వెళ్లాడు. రాజుననే గర్వంతో ద్రుపదుడు ద్రోణుణ్ణి తూలనాడాడు. ఇద్దరిమధ్యా కక్షలేర్పడ్డాయి. ఆ కక్షను తన శిష్యుడైన అర్జునుడిద్వారా తీర్చుకున్నాడు – ద్రోణుడు. తర్వాత ఇద్దరూ కురుపాండవమహాసంగ్రామంలో మరణించారు. ఇది సాధారణస్నేహాలతీరు!

కానీ, భగవంతునిస్నేహంలో ఇలాంటి హెచ్చు తగ్గులుండవు. అందరూ సమానమే – ఆయనకు. సాందీపని ఆశ్రమంలో విద్యాభ్యాసం చేశారు – కృష్ణుడు, కుచేలుడు. ఇద్దరూ ప్రాణస్నేహితులు. చదువయ్యాక ఎవరిదోవ వాళ్లదైంది. కుచేలుడు పేదవాడు. కృష్ణుడు శ్రీమంతుడు కదా!

ఒకసారి కుచేలుడు తనచిన్ననాటి మిత్రుణ్ణి చూడడానికి వచ్చాడు. కృష్ణుడు స్వయంగా ఎదురువెళ్లి, మిత్రుణ్ణి ఆప్యాయంగా కౌగలించుకుని, లోపలికి తీసుకువెళ్లి, బంగారు ఆసనం మీద కూర్చోబెట్టి, సకలఉపచారాలూ చేశాడు. కుశలప్రశ్నలు వేశాడు. యోగక్షేమాలు అడిగి తెలుసుకున్నాడు. నోరు తెరిచి ఇది కావాలని అడుగకపోయినా కుచేలునికి సకలసంపదలూ అనుగ్రహించాడు–కృష్ణుడు. భగవంతుని స్నేహంలో ఉన్న భాగ్యం అది! అలౌకికస్నేహంలో ఉన్న మాధుర్యం అది!

## ఆ రోజుల్లో......




**తిరుమలతిరుపతిదేవస్థానం సుమారు 50 ఏండ్ల క్రితం తి.తి.దే. బులెటెన్‌లో ప్రచురించిన ప్రకటన ఇది. తిరుమల శ్రీవారి దివ్యప్రసాదాలు అంటే, అందులోనూ 'లడ్డూ' ప్రసాదమంటే భక్తులకు ఎంతో ప్రీతి. ఇక, శ్రీవారి 'వడ' ప్రసాదం గురించి చెప్పాల్సిన పనేలేదు.**

**వీటిని భక్తులు తి.తి.దేవస్థాన ప్రసాద విక్రయకేంద్రాలలోమాత్రమే పొందాలి. బయట వ్యక్తులు శ్రీవారి ప్రసాదాల పేరుతో విక్రయించే వాటిని కొనుగోలు చేయరాదు. ఈ విషయాన్ని అందమైన, ఆలోచనాత్మకమైన రేఖాచిత్రంతో తెలియజేసిన ప్రకటన ఇది.**

# నయనానందకరం శ్రీవారి నవరాత్రి బ్రహ్మోత్సవం...





శ్రీవారిఆలయంలో భారతప్రధాని



శ్రీవారిఆలయంలో జ్ఞాపికను స్వీకరిస్తున్న భారతప్రధాని



తిరుమల శ్రీవారిసేవలో భారతప్రధాని శ్రీ నరేంద్రమోదీ
(22-10-2015)



శ్రీవారిఆలయంలో భారతప్రధానితో ప్రముఖులు



2016 సం॥ తి.తి.దే. నూతన క్యాలెండరును,
ఆవిష్కరిస్తున్న గౌ॥ ముఖ్యమంత్రి











నవ్యాంధ్రప్రదేశ్
నూతన రాజధాని
నిర్మాణయజ్ఞానికి
పవిత్రజలాలు,
ఏడుకొండల మృత్తిక
సేకరిస్తున్న దృశ్యం







మ్మాళ్వార్లు యోగమార్గాన్ని అనుసరించి, కాలం గడిపిన మహనీయుడు. అయినా ఆయనకు అన్నికాలాల్లో అన్నివస్తువులూ భగవత్స్వరూపాలు గానే కన్పించేవి. మేఘాల్ని చూచినా, పర్వతాల్ని చూచినా, సముద్రాల్ని చూచినా– "ఆ నీలమే గదా! ఆ ఆనందమే గదా!" అంటూ ఆ నీలమేఘశ్యాముణ్ణి తలచి తలచి, ఆయన మనసులోని సంతోషం ఆయన్ను వదలి, పరిగెత్తుతూ ఉండేది. ఆయనేమో చీకటిని చూచినప్పుడు ఆ భగవంతుని దివ్యదేహాన్ని చూచినట్లే చూచేవారు. ఆ వర్ణం ఆయనను అంతగా ఆకర్షించింది కాబోలు! అంతేకాదు ఏదైనా ఒకజ్యోతిని చూచినా–కోకిలలు, నెమళ్లు మొదలైన పక్షుల్ని చూచినా– అల్లోనేరేడు మొదలైన నల్లని పండ్లను చూచినా – ఆ భగవంతుణ్ణి దర్శించినట్లే ఆనందించేవారు. ఇలా దర్శించి, అనుభవిం చడం ఒకనాడు కాదు – రెన్నాళ్లు కాదు – మూన్నాళ్లు కాదు – ఎన్నో ఏండ్లు అను భవించి, దీని అంతు తెలుసుకోలేకపోయారు. అయితే ఊరికే ఉండ నిస్తుందా మనస్సు? లేదు. నలుపు–నీలం– పచ్చరంగులు చూచినప్పుడంతా ఏదో తాను చేరదలచిన పరమార్థాన్ని చేరినట్లు ఆశ! సమీపించలేక కొన్నిసమయాల్లో దుఃఖాన్నీ – కొన్నిసమయాల్లో సంతోషాన్నీ పొందుతూ "ఇది దైవికశక్తి" అని నిట్టూర్పు వదలుతున్నారు.

అదిగో తెల్లవారుతూంది! ఇప్పుడు వికసించిఉన్న నల్లకలువల్ని – తామెరలను ఇంకా చిత్రవిచిత్రాలైన పూవుల్ని చూచి, నమ్మాళ్వార్ ఏమంటున్నారో వినండి– "ప్రాణం, శరీరం, ఒకటిగా వికసించి, ఊప్పొంగిపోతున్నాయి–పూలు; ఆ దివ్య మంగళవిగ్రహుడైన భగవంతుడే ఈ పూలరూపంలో వచ్చి, మన బోటివారికి దర్శనమిస్తున్నాడు" అంటూ ఏదో పాడుతున్నారు – ఆ ఆనందపారవశ్యంలో –

> **పూవైయుం కాయావుం నీలముం పూక్కిన్ఱ**
> **కావిమలర్ యెన్ఱుం కాండోరుం, - పావియేన్**
> **మెల్లావి మెయ్‌మిగవే పూరిక్కుం, అవ్వవై**
> **ఎల్లాం పిరానురువే యెన్ఱు!**

"పూవులు – కాయలు – నీలంగా, ఎరుపుగా పూస్తు న్నాయి. వీటినన్నిటిని చూచాను. దివ్యమంగళవిగ్రహుడైన ఆ భగవంతునిదివ్యశరీరాన్ని తలపిస్తున్నాయి. శరీరం, మనస్సు



పులకరిస్తూంది. పాపినైన నేను ఇవ్వన్నీ ఉత్తపూలని చూచినాను" అన్నాడు.

ఈ పూలన్నీ ఉత్తపూలుగా భక్తుడైన ఈయన కన్నులకు తెలీలేదు– కాబోలు! "ఓహో! భ్రమించినాను – తెలిసికొన్నాను. అబ్బా! ఒకసారి కాదు – ఎన్నోమార్లు హెచ్చరించినా బుద్ధి వినే టట్లు లేదు. ఆశ వదిలేటట్లు లేదు. తెలుసుకొన్నాను అనే అజ్ఞానపు తెలివికన్నా ఈ భ్రమే మేలని తోస్తూది. ఏది ఏమైనా ఈ భ్రమలో ఉన్న సంతోషం ఆ తెలివిలో లేదు. పాపినైన నాకు కూడా ఇలాంటి భాగ్యమా?" అంటూ కన్నీరు కారుస్తూ, హృదయం పొంగిపోతూ పలవిస్తున్నారు. రోజులు గడుస్తు న్నాయి. తమ యోగాభ్యాసాన్ని సాగిస్తున్నారు– నమ్మాళ్వార్లు.

ఒకనాడు కన్నులు తెరిచి, వికసించిన నల్లకలువల్ని చూచి, ఆశ్చర్యపడ్డారు. సిగ్గుతో తలవంచుకుని ఏదో చెబు తున్నారు – వినండి. "ఆ భగవంతునివర్ణమైన నీలవర్ణాన్ని మీరు పొందారు. ఎంత భాగ్యవంతులో కదా మీరు! మీరేమి తపస్సు చేశారో!!" అని. తలపైకెత్తి అరెరే! తెలిసికొన్నాను! ఎండనక, వాననక, మంచనక ఈ నీటిమధ్యలో ఒంటికాలిపై నిలిచి, తపస్సు చేస్తున్నారు కదూ! అని– అందువల్లే పూలకు ఆ భగవంతునివర్ణం కలిగింది అని కాబోలు నమ్మాళ్వార్లనమ్మిక. అయితే ఈ విధంగా ఎండకు, వానకు, మంచుకు బాధపడుతూ తపస్సు చేయడానికి నమ్మాళ్వార్లహృదయం ఒప్పుకోవడం లేదు.

తలపైకెత్తి ఆకాశం వైపు చూస్తున్నారు – చూస్తూ "మీరు ఆ దేవదేవుని దివ్యశరీరవర్ణాన్ని కొల్లగొన్నారే! ఈ యోగం మీకెట్లా వచ్చింది? ఈ ప్రపంచాన్నంతా ఆకాశరూపంగా వ్యాపించి, ఏమి తపస్సు చేశారో?" అంటుండగా మేఘాలు కొన్ని వారికన్నుల ఎదుట కన్పించాయి. వెంటనే నమ్మాళ్వార్లు దూరంగా పోతూఉన్నమేఘాలు వినేటట్లు "ఆ! ఆగండి ఓ మేఘా ల్లారా!" అంటున్నారు–ఎందుకో?– ఆ మేఘాలను ఏదో ప్రశ్నిస్తా మనుకొన్నట్లుంది – నమ్మాళ్వార్లు. మేఘాలు నిలిచాయి. కానీ, నమ్మాళ్వార్లు ప్రశ్నించలేదు. వారు వేయదలచుకొన్న ప్రశ్నకు వారిఅంతరాత్మే బదులు చెబుతూ ఉంది "తెలుసుకొన్నాను" అని. ఆ ప్రశ్నకు సమాధానం – ఇదిగో నమ్మాళ్వార్లగొంతు నుండి వచ్చే ఆ అమృతధారను పోలినపాశురాన్ని గమనించండి.

**మేగంగళో ఉరైయీర్; తిరుమాల్ తిరుమేని వొక్కుం**
**యోగంగళ్ ఉంగళుక్కు ఎవ్వారుపెర్‌టీర్? ఉయిర్ అళిప్పాన్**
**మాగంగళెల్లామ్ తిరిందు, నన్నీర్‌గళ్ శుమందు, నుంతం**
**ఆగంగళ్ నోప వఋత్తం తవమాం అరుళ్ పెట్రదే!**



తీగలు–చెట్లు–పక్షులు–మృగాలు– మనుష్యులు ఇవీ, అవీ అనేభేదం లేకుండా అన్నీ ఉజ్జీవించాలని శరీరశ్రమనుకూడా లెక్క చేయకుండా–మంచినీటిని మోసు కొని– ఆకాశమంతా తిరుగుతున్నాయి– మేఘాలు. జీవరాసులకు ఉపకారం చేయటంకంటే మేలైన తపస్సుందా? ఈ విధంగా నీటిని మోసుకొని దేశ మంతా తిరిగి వర్షించి – జీవరాసు లకు ఉపకారం చేసి – ఆ ఉపకారం చేయడంవల్ల భగవంతునిదయకు పాత్రులవు తున్నారు– అనుకొంటూ తృప్తిని పొందుతున్నారు – నమ్మాళ్వార్లు.

అంతేకాదు మెరుపులతో కలిసిన మేఘాలు – ఉరుములతో కలిసిన మేఘాలు వీటినన్నింటినీకూడా వర్ణిస్తున్నారు. ఎలాంటికల్పనలో చూడండి – నమ్మాళ్వార్లు కల్పనలు!

ఆకాశం నీలమేఘశ్యాముణ్ణి జ్ఞాపకం చేస్తోంది, మెరుపులు దయాస్వరూపిణియైన మహాలక్ష్మిని జ్ఞాపకం చేస్తున్నాయి. మేఘాలు భక్తుల్ని జ్ఞాపకం చేస్తున్నాయి. ఇవన్నీ కలిసి ఆ లక్ష్మీనారాయణుణ్ణి జ్ఞాపకం చేస్తున్నాయి. మంచినీటిని మోసుకొని, ఆకాశమంతా తిరిగే మేఘాలవల్లే, మంచి నడవడికలు కలిగి, ప్రేమను, దయను మోసుకొని, ఈ భూమినంతా తిరుగుతారు– భక్తులు. తిరగడమే కాదు శరీరశ్రమనుకూడా లెక్క చేయకుండా ప్రాణులకు సన్మార్గసదుపదేశాలు చేస్తూ – వారికి కైంకర్యం చేస్తూ – ప్రేమను, దయను ఈ ప్రపంచంపై వెదచల్లుతూ తిరుగుతారు. ఇంకా– పాపాత్ములు పరితపించి పశ్చాత్తాపాన్ని పొంది, మంచిమార్గాన్ని అనుసరించేటట్లు చేస్తారు. నమ్మాళ్వార్లే చెబుతున్నారు– వినండి. “అవును భక్తి – పరోపకారం – అనేవి రెండే భక్తులకు తపస్సు” అంటున్నారు. నమ్మాళ్వార్లు ఈ విధమైన భక్తబృందాలకు “తల మానికం” అని శ్రీవైష్ణవుల నమ్మిక.

నమ్మాళ్వార్లు తాము పొందిన మహోన్నతస్థానాన్ని స్వల్పకాలంలో పొందలేదని వీరివాక్యాలవల్లే తెలుస్తోంది. ఇదిగో నమ్మాళ్వార్లవాక్యాలు “నేనేమో అనుదినం ప్రార్థన చేస్తున్నాను– ఆ భగవంతుడేమో దర్శనం ఇవ్వలేదు – దర్శనమే కాదు – దయా చూపలేదు – ఓ మనసా! ఆ భగవంతునిదయా ప్రవాహం–ఎక్కి ప్రవహించలేని అంత ఎత్తైన ప్రదేశమా నేనుండే స్థలం?” – అని దుఃఖపడుతున్నారు – ఒక సమయంలో. అంతటితో ఆగక “ఎక్కడ చూచేది? ఈ ప్రపంచాన్నంతటినీ సృష్టించిన మొదటి విత్తనమైన ఆ భగవంతుణ్ణి?” అని దిక్కులన్నీ చూస్తూన్నారు. “గొంతెత్తి అరచి అరచి పిలుస్తున్నానే – అయినా చూడడానికి సాధ్యం కాలేదే – నా అరుపుల్లో ఒక అరుపైనా అతనికి వినిపించలేదా? లేక అతడు బదులు పలికేమాట నాకు వినిపించడం లేదా?” అంటూ నిట్టూర్పు వదులుతున్నారు– ఇంకొక సమయంలో.

ప్రకృతికి అతీతమైన ఆ పరతత్త్వాన్ని తెలుసుకొనే వీలు కాలేదని నిర్ణయించుకొన్నారు – నమ్మాళ్వార్లు. అయినా తన పట్టుదలను వదల్లేక అవతారమూర్తుల్ని పూజిస్తూ ప్రార్థిస్తున్నారు. అన్ని వస్తువుల్లోనూ అంతర్యామిగా ప్రకాశిస్తున్న ఆ జ్ఞానాన్ని – ఆ ప్రేమను – ఆ దయను తెలుసుకొని నమస్కరిస్తున్నారు. స్వయం వ్యక్తమైన దేవాలయాలలో – అంతర్యామియైన వస్తువుకు జ్ఞాపకచిహ్నాలైన విగ్రహాల్ని పూజించి, దయను పెంచుకొంటున్నారు. ఆ విగ్రహాలను దర్శించి –

**అన్దామ త్తన్నుశెయ్దు ఎన్ఆవిశేర్ అమ్మానుక్కు**
**అన్దామవాళ్ ముడిశఙ్గాళ్నూల్ ఆరముళ**
**శెన్దామరై త్తడశఙ్గణ్ శెఙ్గనివాయ్ శెఙ్గమలమ్**
**శెన్దామరై యడిక్కళ్ శెమ్బున్ తిరువుడమ్బే.**

**ముడిచ్చోదియామ్ ఉనదు ముగచ్చోది మలర్న్దదువో**
**అడిచ్చోది నీనిన్ఱ తామరైయామ్ అలర్న్దదువో**
**పడిచ్చోది యాడై యొడుమ్ పల్ కలనామ్ నిన్ పై మ్బొన్**
**కడిచ్చోది కలన్దదువో తిరుమాలే కట్టురైయే.**

“అందమైనపరమపదవాసులపై గల ప్రీతి నాపై ఉంచి, నా మనస్సును చేరినస్వామి అందమైన తులసీమాల, కిరీటం, పాంచజన్యం, సుదర్శనం, యజ్ఞోపవీతం, హారాలతో కూడి ప్రకాశిస్తున్నాడు. అతనివిశాలమైన కన్నులు ఎఱ్ఱతామరలవలే ఉన్నాయి. తామరలవలే నోరు, అధరాలు ఎఱ్ఱగా ఉన్నాయి. శ్రీపాదాలు తామరవలే ఉన్నాయి. ఆ దివ్యమంగళవిగ్రహం పచ్చనిపదారువన్నె బంగారువలే ప్రకాశిస్తోంది.

ఓ శ్రియఃపతీ! నీ ముఖకాంతి ముఖంతో నిలువక పైకెగసి, కిరీటమనే కాంతిరూపంగా ప్రకాశిస్తున్నదా? నీ శ్రీపాదాల కాంతిపుంజం నీవు వేంచేసి ఉన్న పవిత్రపద్మపీఠమై ప్రకాశిస్తున్నదా? నీ అందమైన నడుముకాంతి స్వభావసిద్ధమైన కాంతి గల పీతాంబరంతో కూడి, అనేకవిధాలైన ఆభరణాలై ప్రకాశిస్తున్నదా? ఓ భగవంతుడా! నీవే ఆనతీవయ్యా!” అని, ఇలా తమ ఇష్టదైవాన్ని విశేషమైన మనోభావంతో ధ్యానించి, అందాన్ని చూచి, తనను సేవకునిగా చేసుకొన్న ఆ ప్రేమికునికి తనప్రేమ కిరీటం మొదలైన ఆభరణాలుగాను, తనమనస్సు శరీరానికి పూసే దివ్యచందనంగానూ కల్పించుకొంటున్నారు– నమ్మాళ్వార్లు.

*(మిగతాభాగం వచ్చే సంచికలో....)*

# మందార మకరందాలు

డా॥ సి.నారాయణరెడ్డి



మా సరివాఁడవా మా పాపఁ గొనిపోవ;
నేపాటిగలవాఁడ; వేది వంశ;
మెందు జన్మించితి; వెక్కడఁ బెరిఁగితి;
వెయ్యది నడవడి; యెవ్వఁ డెఱుఁగు
మానహీనుఁడ వీవు; మర్యాద లెఱుఁగవు;
మాయఁగైకొనికాని మలయరావు;
నిజరూపమున శత్రునివహంబుపైఁ బోవు
వసుధేశుఁడవు గావు; వావి లేదు;

కొమ్మ నిమ్ము: నీవు గుణరహితుండవు;
విడువు; విడువవేని విలయకాల
శిఖిశిఖాసమానశితశిలీముఖముల
గర్వమెల్లఁ గొందుఁ గలహమందు.

రుక్మిణిని ఎత్తుకుపోతున్న కృష్ణుణ్ణి అదలించి, తూలనాడుతున్నాడు– రుక్మి. అతనికులాన్నీ, గుణాన్నీ పేరుపేరున ఎంచి దుయ్యబడుతున్నాడు. పైకిచూస్తే అన్నీ నిందలే. రుక్మి నిందలు తప్ప అభినందనలు చేసేవాడా మరి? ఒక దుష్టపాత్ర శిష్టరక్షకుణ్ణి చెడా మడా తిడుతుంటే పాపం మన పోతన్న పులుకు పులుకున చూస్తాడు: 'అయ్యో! నా స్వామి తిట్ల పాలౌతున్నాడే' అని ఆందోళన పడుతాడు. ఆ దుష్టునికి తెలియకుండానే వాడిపాదునోట పరతత్త్వ రహస్యాలను పలికిస్తాడు. ఆ రకంగా తన మనసు నింపుకుంటాడు. ఈ పద్యంలో ఆ పనే చేసినాడు. అటు కృష్ణుడు – ఇటు రుక్మి. ఇక తిట్లవెనుక దాగిన పరమార్థ మేమిటో చూద్దాం –

కృష్ణుడు రుక్మికి 'సరివాడు కాదు' -- నిజమే! అందరికీ అతీతుడు. అతడు ఏపాటి గలవాడు? -- ముల్లోకాలే అతనివి! ఆ సిరియే అతనిది. ఏది వంశం? -- విష్ణుమూర్తికి ఒక వంశమంటూ ఉంటుందా? ఎందు జన్మించితివి? --జన్మ లేనిదే.

ఎక్కడ పెరిగితివి? -- పెరుగుట విరుగుట నరులకు. నారాయణుని కెక్కడిది?

ఎయ్యది నడవడి– నడిపించేవానినడవడి ఎవడెరుగును? మానహీనుడవు -- అశరీరునికి, ఆత్మస్థిరునికి మానప్రసక్తి ఏది? మర్యాద లెరుగవు -- అనంతు డతడు. మాయ గైకొనిగాని మలయరావు-- సర్వమూ అతని మాయే. నిజరూపమున శత్రునివహంబుపైఁ బోవు -- అన్ని రూపాలూ అతనివే! వసుధేశుఁడవు కావు నిజమే! ఒక్క వసుధకే కాదు – చతుర్దశభువనాలకే అధీశ్వరుడు.

వావి లేదు – త్రివిక్రమునికి క్రమంతో నిమిత్తం లేదు. గుణ రహితుండవు – గుణత్రయము జీవకోటికి. గుణాతీతుని కేటికి?

ఇది – పైన నిందగా కనిపించినా – లోన స్తుతిని దాచుకున్న పద్ధతి. అలంకారాలలో వ్యాజస్తుతి.






# అర్జునుడే కాదు... అశ్వాలూ విన్నాయి!!

డా|| గరికిపాటి నరసింహారావు



తనగారి భాగవతంలో ఒక చిత్ర మైన పద్యం ఉంది. అది ప్రథమ స్కంధంలో భీష్మస్తవంలో ఉంది. భీష్ముడు అంపశయ్యమీద ఉండి, శ్రీకృష్ణుణ్ణి స్తుతిస్తూ చెప్పినపద్యం ఇది.

**హయరింఖాముఖ ధూళి ధూసర పరిన్యస్తాలకోపేతమై,**
**రయజాతశ్రమతోయబిందుయుతమై, రాజిల్లు నెమ్మోముతో**
**జయమున్ పార్థున కిచ్చువేడ్క నని నాశస్త్రాహతిన్ చాల నొ**
**చ్చియు పోరించు మహానుభావు నెదలో చింతింతు నశ్రాంతమున్॥**

ఈ పద్యంలో శ్రీకృష్ణునిముఖారవిందాన్ని వర్ణిస్తున్నాడు–భీష్ముడు. యుద్ధరంగంలో తొమ్మిదో రోజు యుద్ధదృశ్యాల్ని మళ్లీ ఒక్కసారి ఊహించు కొంటున్నాడు. ఆ రోజు భీష్ముడు, విజృంభించి యుద్ధంచేశాడు. యుద్ధరంగంలోకి శూలం ధరించి వచ్చిన ప్రళయకాలరుద్రుడిలా ఉన్నాడు. పార్థ సారథి అతివేగంగా రథం నడుపుతున్నాడు. అర్జునుడు యథాశక్తి భీష్మునితో పోరాడుతూ, సారథి యైన కృష్ణుణ్ణి కాపాడుతూ, తనను తాను కాపాడు కొంటున్నాడు. ఆ స్థితిలో శ్రీకృష్ణునిముఖపద్మం ఎలా ఉందో గమనించిన భీష్ముడు ఆ దృశ్యాన్ని మరచిపోలేక మళ్లీ గుర్తుచేసుకొంటున్నాడు.



అతివేగంగా పరిగెడుతున్న అర్జునుని గుర్రాల కాలిగిట్టలనుండి రేగినధూళి గోవిందునినుదుటిమీద పడుతోందట! అప్పటికే బాగా చెమటపట్టిన ఆ నుదుటి మీద ముంగురులు (అలకలు) గుండ్రం గుండ్రంగా గిరజాలు గిరజాలుగా అతు క్కొని, ఆ ఫాలభాగం ఎంతో అందంగా ఉందట! అటువంటి నుదుటిమీద గుర్రాలగిట్టలదుమ్ము పడి, ఆ ముఖానికి అదో అలంకారంలా ఉందట!

ఇక్కడే కాస్త ఆగి ఆలోచించాలి. అసలే యుద్ధరంగం! బీభత్సదృశ్యాలు! భయంకరస్థితి! వేగం, గాలి, ధూళి కళ్లు కప్పేస్తూ ఉంటాయి. ఈ స్థితిలో చెమటతో దుమ్ము కొట్టుకొని ఉన్న ముఖం – ఎంత భగవంతుడిదైతేమాత్రం అంత అందంగా ఉంటుందా? పైగా ముఖంమీద పడిన దుమ్ము – ఆ ముఖంఅందాన్ని పెంచే ఆభరణం కావడం ఏమిటి? అనౌచిత్యంగా లేదూ?

మనకు అలా అనిపించవచ్చు. కానీ, పరమాత్మకు అలా ఉండదు. ఎందుకంటే ఆయన ఆ ధూళిని అలంకారంగానే భావించాడు. మన మనోభావాలనుబట్టే మనముఖం ఉంటుంది. మనం విపరీతమైన ఆనందంతో

నవ్వుతుంటేకూడా కళ్లవెంట నీళ్లొస్తాయి. అవి దూరంనుండి చూచేవాళ్లకు కన్నీళ్లలా కనిపించవచ్చు. కానీ మన ఆనంద బాష్పాలు మనకు తెలుసు. ఎందుకంటే, ఆ సమయంలో మన మనస్సులో ఉన్నది ఆనందమే కానీ దుఃఖం కాదు. అలాగే గుర్రాలు గిట్టలద్వారా పరమాత్మనుదుటిమీద దుమ్ము చిమ్ము తుంటే - ఆయన ఆ ధూళిని నవ్వుతూ స్వీకరించాడు. అందుకే అది అలంకార మయింది.

ఎందుకలా స్వీకరించాడని ఆలోచిద్దాం. ఆయన భగవద్గీతలో ఏం చెప్పాడు? "కర్మణ్యే వాధికార స్తే మా ఫలేషు కదాచన" అన్నాడు. అంటే మనం పనిచేస్తూనే ఉండాలి. కానీ, ఆ పనివల్ల వచ్చేఫలం ఏదైనా భగవదర్పణబుద్ధితో ఆ పని మాత్రం తప్పక చెయ్యాలి. సరిగ్గా అశ్వాలు అదే పని చేశాయి. అశ్వాల పని ఏమిటి? సారథి చెప్పినట్లు విని, పరుగుపెట్టాలి. అవి పాండవపక్షంలో ఉన్నా, కౌరవపక్షంలో ఉన్నా వాటిపని పరుగుపెట్టడంమాత్రమే! ఒకవేళ రథికుడు యుద్ధంమధ్యలో వెనక్కి పారి పోదలిస్తే, సారథి అలాగే నడిపిస్తే, అశ్వాలు ఇంటికే పరుగెత్తాలి కాని సారథి అటు లాగితే, అశ్వాలు ఇటు లాగితే ఇక కథ నడిచేదెట్లా? అర్జునుడిఅశ్వాలు శ్రద్ధగా, భక్తిగా పార్థసారథి ఎలా నడిపిస్తే అలా నడిచాయి. అందువల్ల రేగిన దుమ్మును ఆయనకే అర్పించాయి. అంటే కర్మఫలాన్ని భగవంతునికి సమర్పించాయి. కాబట్టే భగవంతుడు దాన్ని అలం కారంగా భావించి, స్వీకరించి వాటిల్ని అనుగ్రహించాడు. అందుకే ఆయనఫాలభాగం దుమ్ముతో ఉన్నా ప్రకాశించింది. అంటే మనశక్తికొలది మనం జీవితంలో ధర్మనిర్వహణ చేస్తూ, తత్ఫలాన్ని భగవంతుడికి అర్పిస్తే- ఆయన దాన్ని అలంకారంగా భావించి, స్వీకరించి మనల్ని ఆశీర్వదిస్తాడన్నమాట!

ఇంతకీ అశ్వాలకు ఇంత అవగాహన ఎక్కడిది? అర్జునుడితో పాటు గీతోపదేశసమయంలో అశ్వాలుకూడా అక్కడ ఉన్నాయి. అవీ విన్నాయి. మరి వాటికి గీతాభాష అర్థమవు తుందా? మనభాష అర్థం కాదు. కానీ, భగవంతుడిభాష అన్ని జీవులకూ అర్థం అవుతుంది. అది హృదయాలమధ్య సాగే మౌనమహాప్రవాహం!! ●

**మోక్షస్యకాంక్షా యది వై తవాస్తి, త్య జాతిదూరాద్ విషయాన్ విషం యథా ।**
**పీయూషవత్ తోషదయాక్షమార్జవప్రశాంతిదాంతీన్ భజ నిత్య మాదరాత్ ॥**
**(వివేకచూడామణి - ఆదిశంకరులు)**




**మోక్షం కావాలనే కోరిక దృఢంగా ఉంటే, భౌతికవిషయసుఖాలను విషంగా భావించి, వాటికి ఎప్పుడూ దూరంగా ఉండాలి. సంతోషం, దయ, సహనం, ఋజుత్వం, శాంతి, దాంతి - అనే ఉత్తమగుణాలను అమృతంగా భావించి, ఆప్యాయంగా స్వీకరించి, ఆచరించడానికి పూను కోవాలి.**

- ఆముదాల మురళి




డిసెంబరు 16 నుండి
జనవరి 14వ తేదీ వరకు
ధనుర్మాసం /
మార్గశీర్షం

## పాలకడలిపై శేషతల్పమున...

నిరంతరమూ సముద్రజలాలపై నివసించే నారాయణుడు తన భక్తులను తలచుకోగానే, హృదయం పాలవెల్లి కాగా, క్షారసముద్రం కాస్తా క్షీరసాగరంగా మారి పోతున్నది. భక్తజనసంరక్షణార్థం సర్వదా స్వామివారు గుండెల్లో గుడుసుళ్ళుపడు తుంటారు.

పాలకడలిపై శేషతల్పమున పవ్వ ళించిన పురాణపురుషుడు – సంవత్సరంలో పదకొండుమాసాలు యోగనిద్రాస్థితిలో ఉంటాడు. ఒక్కమాసంమాత్రమే మేల్కొని ఉంటాడు. ఆ మాసం పేరే మార్గశీర్షం!

యోగనిద్రలోని స్వామి లోపలి నేత్రాలతో పద్నాలుగులోకాలను సదా పర్య వేక్షిస్తూ ఉంటాడు. అదే స్థితిపాలకత్వం. యోగనిద్రాకాలపరిమితి ముగుస్తున్న వేళకు స్వామివారికి మేల్కోవాలనే సంకల్పం కల్గుతుంది. ఆ సంకల్పం, నిత్యులలో ఆద్యుడైన ఆదిశేషునికి వెంటనే తెలుస్తుంది. ఆయన అంతవరకు స్వామియోగనిద్రకు భంగం కల్గకుండా తన వేయిపడగలతో ఆయనను కప్పిపెట్టి ఉంటాడు. స్వామివారు లోకానికి తన నేత్రదర్శనాన్ని ప్రసాదిస్తున్న వేళ దోమతెరవంటి తన వేయిపడగలను పైకెత్తి, ఎండ తగులకుండా స్వామికి గొడుగు అవుతాడు. కళ్ళు తెరవడమే తరువాయి – భక్తులరాకకోసం స్వామి ఆదుర్దాగా ఎదురు చూస్తుంటాడు. ఈ సందర్భాన్ని పురస్కరించు కొనే తాళ్ళపాక అన్నమయ్య భక్తుల పక్షాన నిలబడి ఇలా అంటున్నాడు.

**విన్నపాలు వినవలె వింతవింతలు**
**పన్నగపుదోమతెర పైకెత్త వేలయ్య!**
**(సం.6, కీ.25)**

జీవుల విన్నపాలు విని తీర వలెనేగాని, ఆ వింతలు, విడ్డూరాలకు అంతుపొంతులు లేవు. పొలుసులుగా పొలుసులుగా ఆవరించిన పాముపడగలు దోమతెరలాగా కన్పడింది– అన్నమయ్యకు. ఆ పడగ లతో స్వామిని సేవిస్తూ సంరక్షించే సామర్థ్యం ఒక ఆదిశేషునికే ఉంది. ఎందు కంటే సృష్టికే తొట్టతొలి జీవుడు ఆదిశేషుడు, తన తర్వాత మూడవవిడతలో పుట్టినమానవులు తమ తమకోర్కెలు విన్నవించుకోవడానికి వెసులుబాటు కల్పిస్తు న్నాడు. **ఆది–శేషు డంటే, సృష్టికి 'ఆది'లో పుట్టి, 'శేషుడు'– సృష్టి చివరి దాకా మిగిలి ఉండేవాడు అని అర్థం.** ఆదిపురుషుడు స్వామి. ఆదిశేషుడు జీవుడు. కృతయుగంలో వైకుంఠంలో పాన్పుగా, త్రేతాయుగంలో లక్ష్మణుడుగా, ద్వాపరయుగంలో బల రాముడుగా, కలియుగంలో భగవద్రామా నుజులుగా, (1017–1137) 120 ఏండ్లు జీవించి, ఆ తర్వాత మణవాళమహా మునులుగా (1266–1346) 80 యేండ్లు జీవించి, శ్రీవైష్ణవసంప్రదాయాన్నీ, విశిష్టా ద్వైతసిద్ధాంతాన్నీ విశ్వవ్యాప్తం చేశారు. ప్రళయకాలంలో వటపత్రంగా, అణిగి మణిగి ఉండి, సృష్టిప్రారంభంలో మరల



ఆదిశేషుడిగా రూపెత్తి, స్వామివారిని సర్వకాలమూ విడువకుండా అంటిపెట్టుకొని ఉండే నిత్యభక్తుడే, దాసకోటికి, జీవకోటికి ఆద్యుడే ఆదిశేషుడు. బ్రహ్మోత్సవాలలో ఆదిశేషవాహనానికి గల వైశిష్ట్యాలలో ఇది ఒకటి.

## మంచుకురిసే వేళ...

మార్గశిర, పుష్యమాసాలు హేమంత ఋతువు. రాత్రిళ్లు మంచు దట్టంగా కురిసేకాలమది. రాత్రివేళలు నిడివిగా, పగటిపూట కురుచగా ఉంటాయి. అనాదియైన మాయచేత కప్పబడిన జీవులు ప్రతిరాత్రీ–విశేషించి, హేమంత ఋతువులో సుషుప్తి అవస్థలోకి తెలియకనే జారుకొంటారు. 'మమ మాయా దురత్యయా' (గీత–7–14) 'నా మాయను ఎవ్వరూ దాటిపోజాలరు' అని గీతా వాక్యం. దోమతెరలో ముసుగుతన్ని గాఢనిద్రలో ఉంటారు. ఉషోదయానికి పూర్వమే నిద్రలేచి, స్నానం చేసి, స్వామిఆలయానికి వెళ్లితేనే కదా విన్నపాలు! జీవులది భోగనిద్ర! స్వామిది యోగనిద్ర!! అయితే భక్తులకంటే ముందే యోగనిద్రాముద్రను వదలి, భక్తజనులను ఉద్ధరించాలని నిలబడి నిరీక్షిస్తున్నాడు – శ్రీవేంకటేశ్వరుడు. కన్నతండ్రికి తన బిడ్డలపై గల మమతానురాగాలకు ఎలా విలువ కట్టలేమో, స్వామివారిదయ, రక్షణం అంతులేని క్షీరసాగరం.



తండోపతండాలుగా వస్తున్న భక్తుల విన్నపాలు వింటున్న స్వామివారు సంవత్సరంలో నెలరోజులుమాత్రమే తాను మేల్కో వడమేమిటి? అని చింతించి, అదివరకు ఎన్నో అవతారాలెత్తి ఉన్నా, ద్వాపరయుగంలో జీవులకు మోక్షమివ్వగల శ్రీకృష్ణావతారంగా, మధురానగరంలో సంపూర్ణంగా ఆవిర్భవించాడు. "మోక్ష మిచ్ఛేత్ జనార్దనాత్" – "మోక్షం కావాలనే కోరికే ఉంటే జనార్దనుణ్ణి ఆశ్రయించండి" అని పెద్దలమాట!

**శ్లో॥ ఏషనారాయణ శ్రీమాన్ క్షీరార్ణవ నికేతనః ।**
**నాగపర్యంక ముత్సృజ్య హ్యాగతో మధురాపురీమ్ ॥**

అని పురాణవాక్కు! భక్తులకు మోక్షమివ్వగల సామర్థ్యం ఒక్క శ్రీమన్నారాయణునికే ఉన్నది కాబట్టి, **"నారాయణనే నమక్కే పఱై తరువాన్"** 'నారాయణుడు ఒక్కడే – మనకే మోక్షమిస్తాడు' అనే దృఢనిశ్చయంతో గోదాదేవి (ఆండాళ్) తిరుప్పావై తొలిపాశురంలో చెప్పినట్లుగా, వైకుంఠంనుండి పాలకడలికి, పాలకడలినుండి మధురానగరానికి స్వామి అంచెలంచెలుగా దిగి వచ్చి, ద్వాపరయుగంలో శ్రీకృష్ణుడుగా అవతరించాడు.

## మార్గశీర్షమంటే.....

**మాసానాం మార్గశీర్షోఽ హం-ఋతూనాం కుసుమాకరః**

– అని గీతాచార్యుడైన శ్రీకృష్ణపరమాత్మ నరుడైన అర్జునునికి విభూతియోగం (10–35)లో ఉపదేశించాడు. మాసాలలో నేను మార్గశీర్షాన్ని, ఋతువులలో నేను వసంతఋతువును. చైత్ర, వైశాఖమాసాలు వసంతఋతువు. మార్గశిర, పుష్యమాసాలు హేమంతఋతువు.

మానవునిమొత్తం ఆయుర్దాయంప్రకారం పర్యాలోచన చేస్తే – వసంతఋతువు – మానవుని

యౌవనదశకు, హేమంతఋతువు – మానవుని వార్ధక్యదశకు ప్రతీకగా చెప్పవచ్చు. కాలస్వరూపం అనంతమైనది. భగవంతుడు కాలాత్మకుడు. 'తస్మై కాలాత్మనే నమః' అని మహాభారతం. భగవంతునికి ఏ ఋతువైనా ఒక్కటే! కానీ, మానవునికి వార్ధక్యదశలోనే మోక్షచింతన అంకురిస్తుంది.

మృగశీర్షానక్షత్రం, పౌర్ణమి కలిస్తే మార్గశీర్షమాస మనబడుతుంది. మార్గ–శీర్ష అనే రెండు సంస్కృతపదాల వికృతి రూపాన్నే 'మార్గళి' – అని తమిళంలో వ్యవహరిస్తారు. జ్యోతిశ్శాస్త్రం ప్రకారం **'శరవత్ మృగశిరాత్రయమ్'**. వరుసగా ఉన్న మూడునక్షత్రాలే మృగశిరానక్షత్రం. *—*—*> ఇది బాణంఆకారంలో ఉంటుంది. శరమంటే బాణం, నీటిజాలు అని అర్థం. ఇది మార్గళిమాసంలో కురిసే మంచు. సంస్కృతంలో మార్గణం అనే శబ్దానికి వెదకు, యాచించు అనీ అర్థాలున్నాయి. వెదకడం దేనిని? యాచించడం దేనిని? అంటే మోక్షాన్ని వెదకడం, మోక్షాన్ని యాచించడం అని అర్థం. 'మృగశీర్ష' అనే పేరులో 'మృగ' శబ్దానికి 'వెదకబడునది' అని విశేషార్థం, 'జింక' అని సామాన్యార్థం. మార్గశీర్షంలో 'మార్గమూ', మృగశిరలో 'మృగము', 'మార్గణము' అనే పదము – ఇవి మూడూ తెలియనిదారిని వెదకడం అనే అర్థంలో ఉండడం, అందుబాటులో లేని మోక్షాన్ని వెదకడం, అన్వేషించడం అనే అర్థాలలో ఉన్నది. ఈ అర్థంలోనే 'మార్గళి' అని తిరుప్పావై ప్రారంభం కావడంలోని ఔచిత్యం దాగి ఉంది. మోక్షమార్గాన్ని అన్వేషించేవ్రతం – తిరుప్పావై.

'మార్గశీర్ష'మనే మాటకు, 'తిరుప్పావై' అనే మాటకు అవినాభావసంబంధముంది. ఇవి రెండూ ఒకే అర్థాన్ని, పరమార్థాన్ని ప్రతిపాదించేమాటలు. "మార్గశిరం" అన్నా, "మార్గశీర్ష"మన్నా ఒక్కటే! 'శిర' మే 'శీర్షం'! ఒక విషయానికి 'శీర్షం' పతాకవంటిది. అలాగే తనువుకు 'తల' పతాకాశీర్షిక! అందుకే "సర్వస్య గాత్రస్యశిరః ప్రధానం" అన్నారు.

**'మార్గశీర్ష' మంటే "మోక్షానికి దారిచూపేది" అని అర్థం! మార్గమంటే మోక్షమార్గం! శీర్షం / శిరం = మోక్షసాధనకై తల–ములు సూపుట – మార్గశీర్షం!** (త్రాసులోని ముల్లు బరువెంతో సూచించినట్లు) అక్కడ 'తల' అంటే శిరస్సులోని సంకల్పం. అదే, మార్గనిర్దేశం చేసేది, దారి చూపేది, మార్గోపదేశిక! **ముముక్షువులైన జీవులకు మోక్షమార్గనిర్దేశం చేసేమాసమే మార్గశీర్షమాసం!** పైగా, ఇది ఆరువిధాలైన శరణాగతుల్లో తొట్టతొలిదైన ఆనుకూల్యసంకల్పం. అంటే భగవంతునికి మిక్కిలి ఇష్టమైనకార్యం. అందుకే భగవంతుడు ముముక్షువులకు మోక్షమార్గనిర్దేశం చేసేమార్గశీర్ష మాసాన్ని నేను' అని గీతలో అన్నాడంటే తన సంకల్పం, భక్తులమనోభీష్టం రెండూ అను కూలంగా ఉన్నప్పుడే ఆ నెలలో తాను మేల్కొని, ఆయా భక్తులైన మోక్షార్థులను ఉద్ధరిస్తున్నాడని అర్థం. విష్ణుసహస్రనామభాష్యంలో శ్రీశంకరభగవత్పాదులు 'మార్గః', 'ఓం మార్గాయ నమః' అనే పేర్లకు (365, 397, 398), **'ముముక్షవః తం దేవం మార్గయన్తి ఇతిమార్గః'** (మోక్షార్థులచే వెదకబడువాడు) **పరమానందో యేన మార్గేణ ప్రాప్యతే స మార్గ ఇతి వా** (పరమానందము పొందిన వాడు– మార్గుడు) అన్నారు. మోక్షార్థులు ఈ పరమాత్మను తెలుసుకొని జననమరణరాహిత్యరూపమైన మోక్షాన్ని పొందు తున్నారు. కాబట్టి, శ్రీకృష్ణఉపాసనమే మోక్షనిర్దేశకం" అని భాష్యం వ్రాశారు. అందుకే **'మార్గశీర్ష వ్రతాన్ని'** భాగవతపురాణం పేర్కొన్నది.

**'తిరుప్పావై' అనే పదంలో –**
**తిరు = శ్రీ, ఐశ్వర్యం, అమృతం, మోక్షం;**
**పావై = వ్రతం, నోము.**

**'అమృతతుల్యమైన మోక్షాన్ని అనుగ్రహించే వ్రతం'** అని 'తిరుప్పావై' శబ్దానికి అర్థం. అదే నిజమైన ఐశ్వర్యం. నిత్య, అనిత్య వస్తువివేకంగలవాడు, ఇహ, పర ఫలభోగాలలో వైరాగ్యవంతుడూ, 'శమం' ఆదిగా గల ఆరుగుణాలు గలవాడు, అయిన ముముక్షువు కోరేది మోక్షం! విముక్తి! విడుదల!

యజ్ఞాలు స్వర్గలోకసుఖాలను ఉద్దేశించి చేసేవి. **'స్వర్గ కామో యజేత'** అన్నారు. స్వర్గప్రాప్తి పొందినవారికి పునర్జన్మ తప్పదు. **'క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి'** (9–21) అని గీతా వాక్యం. ఈ భూమిపై నీ పుణ్యాన్ని జనులు స్మరించినంతవరకే స్వర్గవాసం. అది మరుగునపడిన వెంటనే ఈ నేలపై మళ్లీ జన్మించవలసిందే. 'మోక్ష' మనే మాటకు 'విడుదల' అని అర్థం.

**జననమరణసంసార రూపమైన సకలబంధాలనుండి విముక్తిని ప్రసాదించే విడుదలయే మోక్షం!** పునర్జన్మ లేని శాశ్వతానంద ప్రాప్తియే మోక్షం! **'న స పునరావర్తతే'** అని మోక్షాన్నిగురించి చెప్పబడింది. శ్రీవైష్ణవసంప్రదాయంలోని మూడు చరమశ్లోకాలలో రెండవదైన శరణాగతి అత్యుత్కృష్టమైనది. గీతలో చిట్ట చివరి అధ్యాయమైన మోక్షసన్న్యాసయోగంలో–

**సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ ।**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥ (18-66)**

'సమస్తధర్మాలను విడిచిపెట్టి, నన్నొక్కణ్ణి మాత్రమే 'శరణు' పొందు. సమస్తపాపాలనుండి నిన్ను నేను విముక్తుణ్ణి చేస్తాను. నీవు దుఃఖించవద్దు' అని చెప్పిన భగవద్వాక్యమే ముముక్షువు లందరికీ పరమప్రమాణం!

## ధనుర్మాస మంటే....?

సామాన్యంగా పెద్దలు చెప్పేది – మంచు విపరీతంగా మార్గశిరమాసంలో కురుస్తుంది కాబట్టే, దాన్ని హేమంతఋతువు అన్నారు. ఆ ఋతువులో మనుష్యులు మంచుకు తడిసి, చలికి గడగడ వణుకుతూ వీపు విల్లులాగా వంగిపోగా–ఒక మూల ముడుచుకొని పడుకొంటారు. సోమరులై, నిద్రపోతుంటారు. అలాంటివారు తెల్లవారుజామున నిద్రలేచి, స్నానం చేసి, విష్ణుదేవాలయానికి వెళ్లాలనే సంకల్పం కల్గి ఉండడం సాధ్యమా? అందుకే, విల్లులా వంగిపోయిన మానవునివార్ధక్య దశకు సంకేతనామమే 'ధనుర్మాసం' అంటారు – పెద్దలు. జ్యోతిశ్శాస్త్రం ప్రకారం సూర్యుడు ధనూరాశిలో ప్రవేశించే మాసం ధనుర్మాసం. దీన్నే ధనుస్సంక్రమణం అంటారు.

కానీ, ఇక్కడ ఆధ్యాత్మికార్థం వేరు. విల్లులా వంగిపోయిన మనిషిలో బాణంవంటి సునిశితసంకల్పం, మోక్షసాధనకోసం లక్ష్యశుద్ధి, సిద్ధి ఏవీలేవు. వట్టి విల్లు చేతిలో ఉన్నంతమాత్రాన ఏదీ సాధింపబడదు. అందుకే ముండకోపనిషత్తు ఇలా చెప్పింది–

**ప్రణవో ధనుః శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే ।**
**అప్రమత్తేన వేద్ధవ్యం శరవ త్తన్మయో భవేత్ ॥ (2-2-4)**

'ప్రణవం' అంటే ఓంకారం. అది 'అ'కార, 'ఉ'కార, 'మ'కారాలనే అక్షరసంపుటీకరణం. అటువంటి ప్రణవాన్ని 'ధనుస్సు'గా ధరించి, జీవాత్మను బాణంగా సంధించి, 'బ్రహ్మ' మనే లక్ష్యానికి గురిపెట్టి, జాగరూకతతో బాణప్రయోగం చేస్తే– సాధకునిలక్ష్యశుద్ధి సిద్ధిస్తుంది. ఆ సిద్ధియే బ్రహ్మైక్యం! మోక్షసిద్ధి!! ఇది ధనుర్మాసవైశిష్ట్యం'!

అందుచేత, ప్రకృతిలోని సహజవాతావరణలక్షణాలకు, ద్వంద్వాలకు భయపడి నిద్రపోకుండా జీవుడు 'ధీరుడై' మోక్షగామి కావాలనేదే ధనుర్మాససందేశం! (ఆధ్యాత్మికయోగసాధకుడినే 'ధీరు'డంటారు.)

**ధనుర్ గృహీ త్వౌపనిషదం మహాస్త్రం**
**శరం హ్యుపాసా నిశితం సందధీత ।**
**ఆయమ్య తద్భావగతేన చేతసా**
**లక్ష్యం తదేవాక్షరం సోమ్య విద్ధి ॥ (2-2-3)**

"ఉపనిషత్తును బలమైన కోదండంగా గ్రహించి, దానిపైన ఉపాసనచే వాడిగా చేయబడిన బాణాన్ని సంధించి, బ్రహ్మచింతన చేస్తున్న మనస్సుతో అల్లెత్రాటిని లాగితే– నీవు లక్ష్యాన్ని ఛేదించ గలవు" అంటోంది– ముండకోపనిషత్తు. ఇదంతా ఏకాగ్రత గల యోగసాధనరహస్యం!

పురుషులు చేయలేనిపనిని భాగవతంలో గోపికలు, తత్పూర్వం – కాత్యాయనియైన పార్వతి, 'ఆర్యామహాదేవి'యైన 'ఈశ్వరి'ని ఉపాసించిన రుక్మిణి– వీరందరినీ ఆదర్శంగా గ్రహించిన గోదాదేవి, ఆమె చెలికత్తెలు శ్రీకృష్ణపరమాత్మలో లీనమైనారంటే అబలలుగా చెప్పబడినస్త్రీలు సాధించలేనికార్యమంటూ ఈ భూమండలంలో ఏదైనా ఉన్నదా? అని ఆధ్యాత్మికశాస్త్రం పురుషుల్ని ప్రశ్నిస్తూ ఉంది. పురుషులు ఉపనిషత్తులు చెప్పిన యోగాన్ని, సాధనచేయాలి ! అనింది భగవద్గీత!

అందుకే, 'తస్మాత్ యోగీ భవార్జున!" (ఆత్మసంయమ యోగం, 6–46) అన్నాడు–గీతాప్రవక్త. స్త్రీలకు వ్రతమార్గం, పురుషులకు యోగమార్గం పరమాత్మ నిర్దేశించాడు. ఈ రెండింటికీ పునాది భక్తి–శరణాగతి! *(ఇంకా ఉంది)*




బ్రహ్మశ్రీ తంగిరాల వేంకటకృష్ణపూర్ణప్రసాద సిద్ధాంతి,
తి.తి.దే. ఆస్థానసిద్ధాంతి, రేలంగి



**మేషం :** గ్రహస్థితి ప్రథమార్ధంలో మిక్కిలి ప్రతికూలం. స్త్రీకలహం, కుటుంబఅసౌఖ్యం. ఆర్థికవిషయాలు మాత్రం ప్రోత్సాహకంగా ఉంటాయి. ద్వితీయార్ధం సామాన్యంగా నడుస్తుంది. కోపతాపాలు అదుపులో ఉంచుకునే ప్రయత్నం చేయండి. సున్నితమైన కాలగమనంలో ఉన్నారని గ్రహించండి. అందరినీ కలుపుకునిపోయే ప్రయత్నంచేస్తే మంచిది.



**వృషభం :** గ్రహస్థితి ప్రతికూలం. చేసే వృత్తి, వ్యాపారాల్లో శ్రమఅధికం. ఫలితం సామాన్యం. చేసే ప్రయత్నాలలో విపరీతకాలయాపనతో నిరాశానిస్పృహలు. మాసంచివరలో భార్యాకలహం, అవమానం, పూర్వపుణ్యకార్యాలు మళ్లీ చేయాలనిపించడం, వ్యర్థవాదనలు ఉంటాయి. ధన, ధాన్య, వస్త్ర లాభాలు. పెట్టుబడులలో ఉత్సాహం. వ్యవహారప్రతిబంధకాలు, వృథాఖర్చులు.



**మిథునం :** గ్రహస్థితి ప్రారంభంలో సామాన్యంగా నడస్తుంది. ద్వితీయార్ధం ప్రతికూలం. చేసే వృత్తి, వ్యాపారాలలో ఆటంకాలు, వృథాప్రయాణాలు, త్రిప్పట, ఆదాయానికి మించిన వ్యయాలు, అనారోగ్యం, ఔషధసేవ ఇంటా బయట కలహాలు, కోపతాపాలు అదుపులో ఉంచుకోవాల్సిన సమయం. మాసారంభంలో అపవాదులు కలిగినా క్రమంగా తొలగిపోతాయి.



**కర్కాటకం :** అధికారులతో పరిచయాలు, ఆనందం, చేసే పనిలో తృప్తి, ధైర్యంతో దర్జాగా ఉంటారు. గ్రహస్థితి అనుకూలం. వృత్తివ్యాపారాలు అనుకూలం. ధనవిషయంలో ఎట్టి ఇబ్బందీ కలుగదు. యత్నకార్యసిద్ధి, మిత్రలాభం. కుటుంబవ్యక్తులతో, వ్యాపారభాగస్వామ్యంవారితో మాటతొందర వల్ల విరోధాలు పెరుగుతాయి. ఇతరుల ఆత్మస్థైర్యం దెబ్బతీసే విధంగా మాట్లాడడంవల్ల అనర్థాలు. ఇతరులపై వ్యాఖ్యలు తగ్గించండి.



**సింహం :** గ్రహస్థితి అనుకూలం. మిత్రలాభం, సంఘంలో గొప్పవారితో పరిచయం. యత్నకార్యసిద్ధి, వాదోపవాదాల్లో పైచేయి. సోదరులవల్ల ధనలాభం. కొన్నిసందర్భాల్లో వ్యయప్రయాసలున్నా భరించి ముందడుగువేస్తారు. ఆత్మవిశ్వాసం ప్రదర్శిస్తారు. కష్టానికి తగినఫలితం, గుర్తింపు లభిస్తాయి. కుటుంబ వాతావరణం ఆహ్లాదకరంగా ఉంటుంది. స్థిరవృద్ధి. దేహపుష్టి, సౌఖ్యం, ధనవృద్ధి.

**కన్య :** గ్రహస్థితిఅనుకూలం. వృత్తి, వ్యాపారాల్లో అనుకూలత, అభివృద్ధి. ధనవిషయమై ఏ లోటు ఉండదు. సంతానవిషయసమస్యలకు పరిష్కారం. ప్రథమార్ధంలో అనారోగ్యం. ప్రతిపనీ కష్టంగా తోచుట, అనవసర చికాకులతో వివాదాలు. శత్రుత్వాలు కొనితెచ్చుకొంటారు. అధికారహోదా పెరుగుతుంది. అనవసరఖర్చులు. భూములు కొనుగోలువల్ల లాభం. భూగృహస్థిరాస్తి వృద్ధి.





**తుల :** గ్రహస్థితి సామాన్యం. వృత్తివ్యాపారాలు సామాన్యంగా నడుస్తాయి. పూర్వపుస్నేహితుల సహాయ సహకారాలతో కొన్నిసమస్యలు పరిష్కారమౌతాయి. అవసరాలకు సొమ్ము ఏదోవిధంగా చేతికందుతుంది. ద్వితీయార్ధంలో అస్థిరత్వం, ఆందోళన, భయం, అనారోగ్యం కలుగుతాయి. గతమాసంలోని పెట్టుబడులు ఫలిస్తాయి. వ్యవహారపుమెలికలనుండి తెలివిగా బయటపడతారు.

**వృశ్చికం :** గ్రహస్థితి. వృత్తివ్యాపారాలు అనుకూలత. ధనలాభం, కుటుంబసౌఖ్యం. బంధుమిత్రులతో విందు వినోదకాలక్షేపం, ఇష్టదేవతాదర్శనం, ఆనందం, యత్నకార్యసిద్ధి. ప్రయోజనకరప్రయాణాలు. స్త్రీమూలక ధనలాభం. గృహసౌఖ్యమూ, ఆరోగ్యవిషయంలో స్వల్పలోపాలు. కార్యాలందు నూతనఉత్సాహం. బంధుమిత్రాదులతో గోష్ఠి. ఆకస్మికధనలాభం. వృత్తిగౌరవం, ఆకస్మికధనలాభాలు.





**ధనుస్సు :** గ్రహస్థితి అనుకూలం. వృత్తి, వ్యాపారాల అనుకూలత. ధనలాభం. కుటుంబసౌఖ్యం, బంధుమిత్రులతో విందువినోదకాలక్షేపం, ఇష్టదేవతాదర్శనం, ఆనందం. విద్యావేత్తలతోసదస్సులు, సమావేశాలు జరుగుతాయి. వివాహాదిశుభకార్యాలు కలసివస్తాయి. మాసాంతదినాలలో అనుకోనిప్రమాదసూచన.

**మకరం :** గ్రహస్థితిసామాన్యం. వృత్తివ్యాపారాలు అంతంతమాత్రం. విద్యార్థులకు శ్రమిస్తే గానీ ఫలితం దక్కదు. ప్రయత్నాల్లో జాప్యం. ఆదాయానికి మించిన వ్యయం. జాగ్రత్తలు పాటించడం అవసరం. ఫైనాన్సు సంబంధవ్యాపారులకు ఆదాయం మెరుగవుతుంది.





**కుంభం :** ప్రథమార్ధంలో ఆకస్మికధనలాభాలు కలుగుతాయి. వ్యవసాయదారులకు సమయానికి సొమ్ము చేతికంది అవసరాలు తీరుతాయి. వృత్తి వ్యాపారాల అనుకూలత. అభివృద్ధి, చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. మాసాంతంలో ఆదాయానికి మించి వ్యయం. వృథాప్రయాణాలు, శరీరపీడ కలుగుతాయి. మనోవ్యాకులత. ముఖ్యకార్యాల్లో తత్తరపాటు. నిరంతరశ్రమవల్ల అనారోగ్యం.

**మీనం :** శుభాశుభమిశ్రమఫలితాలుంటాయి. వృత్తివ్యాపారాల్లో చిన్నచిన్నచిక్కులు, ఆదాయం ఆశించినంతగా ఉండదు. చేసేప్రయత్నాల్లో శ్రమానంతరం విజయం. వ్యవసాయదారులకు అనుకూలం. ఋణాలు చెల్లించకపోవుటవల్ల ఇబ్బందులు. నెలచివర ఆర్థికంగా ఇబ్బందులు. వృత్తివ్యాపారాల్లో తిరోగమనం, అష్టమ కుజప్రభావంచేత ఋణాలు చేయాల్సి వస్తుంది. ఆర్థికవిషయాలు అనుకూలం కాదు.





మార్కండేయుని....

# వేంకటాచలయాత్ర

– జూలకంటి బాలసుబ్రహ్మణ్యం




మార్కండేయమహర్షికి 'సమస్తలోకాల్లోని అన్నితీర్థాల్లోనూ స్నానాలు చేయాలనీ, బ్రహ్మాండాల్లోని అన్నిపుష్కరిణుల్లోనూ మునకలు వెయ్యాలనీ ఓ విశిష్టమైన ఆశ కలిగింది.

తనకేమో ఎంతకూ తరగని, పెరగని వయస్సు. పైగా చిరంజీవి. ఇంకేం కావాలి? తనకోరిక తీరడానికి. ఇలా అనుకున్నదే ఆలస్యం! తీర్థయాత్రలకు బయలుదేరాడు. తనకు ఎదురుపడిన, కనపడిన తీర్థాలన్నింటిలోనూ, ఇతరులద్వారా తెలుసుకున్న తీర్థాలోనూ స్నానాలు చేశాడు. అక్కడి అనుష్ఠానాలూ, తీర్థవిధులూ ఆచరించాడు.

ఇలా అంతులేకుండా తిరుగాడుతున్నందువల్ల మార్కండేయ మహర్షికి ఏదో తెలియని రుగ్మత కలిగింది. ఎక్కడ లేని నీరసం వచ్చింది. పాపం! ఇంతా చూస్తే– భూమండలంలోని కొన్నివందల తీర్థాలసందర్శనమాత్రమే! ఇలా జరిగిందే! భూలోకం అంతా తిరిగేది ఎప్పుడు? ఇవిగాక సమస్తలోకాల్లోని తీర్థాల్లో స్నానం చేసేదెప్పుడు? – అనే అసంతృప్తి మిగిలింది. అయ్యో! తన కోరిక తీరదేమో! అనే నిరాశకు లోనయ్యాడు – మార్కండేయుడు.

పూర్వం తాను పట్టిన మంకుపట్టువల్ల పరమేశ్వరుడే కరగిపోయి తనప్రాణం నిలబెట్టడమేగాక, చిరంజీవత్వాన్ని ప్రసాదించాడుకదా! అందువల్ల నిరుత్సాహ పడరాదు. అయితే ఏం చెయ్యాలో తెగ ఆలోచించాడు. అందుకు ఒక అద్భుతమైన ఊహతట్టింది. అంతే దాన్ని అమలు చేశాడు.

**2015**
**డిసెంబరు 22**
**"స్వామిపుష్కరిణీ తీర్థముక్కోటి"**

చతుర్ముఖబ్రహ్మదేవు డున్నాడు కదా! ఆయన్నుగూర్చి తపస్సు చేద్దాం– అనుకొని ప్రారంభించాడుకూడా! బ్రహ్మదేవునికి ఆశ్చర్యం కలిగింది. ఇదేమిటి? సాక్షాత్తు పరమ శివుడే చిరంజీవత్వాన్ని ప్రసాదించిన మార్కండేయు డేమిటి? తననుగూర్చి తపస్సు చెయ్యడ మేమిటి? ఆనందంతో వెంటనే ప్రత్యక్షమయ్యాడు.

**బ్రహ్మదేవునికి ఆశ్చర్యం కలిగింది. ఇదేమిటి?**

**సాక్షాత్తు పరమశివుడే చిరంజీవత్వాన్ని ప్రసాదించిన మార్కండేయు డేమిటి?**

**తనను గూర్చి తపస్సు చెయ్యడ మేమిటి?**

**ఆనందంతో వెంటనే ప్రత్యక్షమయ్యాడు.**

**'అయ్యా! మహర్షీ! ఎందుకోసం ఈ తపోదీక్ష! ఏం కోరిక మిగిలింది?' అన్నాడు - బ్రహ్మదేవుడు.**

'అయ్యా! మహర్షీ! ఎందుకోసం ఈ తపోదీక్ష! ఏం కోరిక మిగిలింది?' అన్నాడు - బ్రహ్మదేవుడు.

"సృష్టికర్తా! బ్రహ్మదేవా! నాకొక ఆశ కల్గింది. నా ఆశ అడియాస కాకుండా నెరవేర్చు. ఎందుచేతంటే ఇప్పటికే నాకు తెలిసినతీర్థాల్లో, విన్నతీర్థాలలో స్నానాలు చేశాను. ఈ కొద్దిపాటితీర్థాలసందర్శనంతోనే నేను నీరసించిపోయాను. నా శరీరం శుష్కించిపోయింది. దీనివల్ల నా కోరిక తీరదేమోననే భయం ఏర్పడింది. అందువల్ల, సమస్త బ్రహ్మాండాల్లోని సర్వతీర్థాలోనూ స్నానం చెయ్యాలనే నాకోరిక తీరేట్లుగా వరం అనుగ్రహించండి!" అంటూ రెండు చేతులూ జోడించాడు - మార్కండేయమహాముని.

ప్రసన్నవదనంతో మందహాసం చేస్తూ బ్రహ్మ దేవుడు ఇలా అన్నాడు.

"మార్కండేయమహాశయా! నీ తపస్సు అమోఘం! అద్భుతం! నీ కోరిక ఆశ్చర్యం! నీ కున్న కోరిక అడిగావు - బాగుంది. కానీ అది ఎన్నటికీ తీరనికోరికే! నీకే కాదు - ఆ పరమశివునికి గాని, నాకు గాని అలాంటికోరిక తీరదుగాక తీరదు. ఎందుకంటే, బ్రహ్మాండాలు అనంతం! మరి వాటిల్లోని తీర్థాలుకూడా అనంతమే! అందువల్ల నెరవేరని ఆ వరం ఇవ్వడంలో అర్థమే లేదు. కానీ, ఒక్కమాట! సమస్తతీర్థాలను సేవించలేక పోతున్నానే అని నీవు చింతించవద్దు. ఆ తీర్థాలన్నింటినీ దర్శించినఫలం వచ్చే ఉపాయంమాత్రం చెబుతాను. దాన్ని ఆచరించు. చాలు.

**అస్తి శ్రీవేంకటో నామ ప్రథితః పర్వతోత్తమః**
**ద్రవిడేషు మహాపుణ్యః సేవితః త్రిదశై ర్గిరిః**
**తస్య శృంగే సుమహతీ పుణ్యా పాపవినాశినీ**
**స్వామిపుష్కరిణీ నామ సరసీ సర్వకామదా ॥**

భూమండలంలో మేరుపర్వతానికి దక్షిణంగా 'శ్రీవేంకటం' అనే పేరుతో ఒక పరమపర్వతం ఉంది. ఉత్తమోత్తమం అయిన ఆ వేంకటాచలశిఖరాన్ని అన్నివేళల్లోనూ దివ్యశక్తిసంపన్నులైన ఎందరో దేవతలు సేవిస్తుంటారు.

ఎవరో ఎందుకు? ప్రతిరోజూ బ్రాహ్మీముహూర్తంలో నేనూ, నాతో పాటు ఎందరో దేవతలు "స్వామిపుష్కరిణి"లో స్నానంచేసి, శ్రీవేంకటేశ్వరుణ్ణి దర్శిస్తాం. అంతేకాదు - మార్కండేయా! నిన్ను యమునిబారినుండి రక్షించిన 'రుద్రుడే' ఆ క్షేత్రపాలకుడు. అలాంటిదివ్యమైన ఆ క్షేత్రంలో **స్వామిపుష్కరిణి** అనే మహిమాన్వితమైన సరస్సు ఉంది. ఆ కోనేరు సర్వపాపాలను పోగొడుతుంది. అనంతపుణ్యాలు కలిగిస్తుంది. అన్నికోరికలనూ తీరుస్తుంది.

అంతటి గొప్పక్షేత్రంలోని ఆ స్వామితీర్థంలో స్నానం చెయ్యి. నీకు ఎలాంటి బడలిక లేకుండానే సులువుగా నీ కోరిక నెరవేరడంతో పాటు, సమస్త తీర్థాలను సేవించినఫలంకూడా సిద్ధిస్తుంది.

మార్కండేయమునీ! ఇంకొక్కమాట.

**శ్లో॥ ధనుర్మాసే సితే పక్షే ద్వాదశ్యా మరుణోదయే**
**ఆయాంతి సర్వతీర్థాని స్వామిపుష్కరిణీ జలే ।**
**తత్ర స్నాత్వా నరః సద్యో ముక్తి మేతి న సంశయః**
**యస్యజన్మ సహస్రేషు పుణ్యమేవార్జితం పురా ॥**

ధనుర్మాసంలో అనగా మార్గశిరమాసం శుద్ధ ద్వాదశినాటి అరుణోదయవేళలో ప్రతిఏటా - పద్నాలుగులోకాల్లోని తీర్థాలన్నీ ఏడుకొండలవాని సన్నిధిలోని "స్వామిపుష్కరిణి"లో దివ్యరూపంతో స్నానాలు చేస్తాయి. ఎందుకో తెలుసా?

అన్నిలోకాలవాళ్లూ ఆ యా తీర్థాల్లో స్నానం చేసినందువల్ల తమకు సంక్రమించినమహాపాతకా



లన్నింటినీ – ప్రతి సంవత్సరం ధనుర్మాసం లోని వైకుంఠద్వాదశినాటి సూర్యోదయవేళలో స్వామిపుష్కరిణితీర్థంలో స్నానంచేసి, ఆ తీర్థాలు పోగొట్టుకుంటాయి. ఇది పరమ సత్యమైన మాట.

ఒక్కప్పుడు ఈ తీర్థాలన్నీ శ్రీమన్నారా యణుని దగ్గరికి వెళ్ళి, మొరపెట్టుకున్నాయట! భక్తులు తమలో మునిగినందువల్ల తమకు సంక్రమించిన పాతకాలు నశించేమార్గం గానీ, మంత్రం గానీ, ఉపదేశించం" దని.

అందుకు భగవానుడు ఇలా అన్నాడు.

"మీరందరూ సంవత్సరానికి ఒక్కరోజు, అనగా మార్గశిరశుద్ధద్వాదశి (వైకుంఠ ద్వాదశి) నాటి సూర్యోదయసమయంలో వేంకటాచలక్షేత్రంలో ఉన్న "స్వామిపుష్కరిణి" అనే తీర్థంలో స్నానం చెయ్యండి. మీ మీ పాతకాలన్నీ నశిస్తాయి. నిర్మలమై ప్రకాశి స్తారు. నేనుకూడా ఆ తీర్థం ఒడ్డునే "వేంకటే శ్వరుడు"గా కొలువై దర్శనమిస్తాను" – అని.

అందువల్ల చిరంజీవీ! సరిగ్గా ఆనాటికి తిరుమలక్షేత్రానికి వెళ్ళి, ఆ సరస్సులో స్నానం చెయ్యి. ఆనాటి పర్వదినాన్ని "శ్రీస్వామి పుష్కరిణీతీర్థముక్కోటి" అంటారు. ముక్కోటితీర్థాలు "స్వామి పుష్కరిణి"లో కలిసే ఆనాటి మంగళప్రదమైన సమయంలో స్నానంచేసే మహాభాగ్యం అందరికీ కలుగదు. వేలజన్మల్లో పుణ్యాన్ని ఆర్జించుకొన్నవాళ్లకుమాత్రమే ఆనాడు తిరుమల శ్రీవారికోనేటిలో స్నానంచేసే అదృష్టం కలుగుతుంది. వాళ్లకు తప్పక జీవన్ముక్తి సిద్ధిస్తుందని చెప్పబడింది. అంతమాత్రమే కాదు:

## శ్రీస్వామిపుష్కరిణీతీర్థముక్కోటి

ఈ సంవత్సరం 2015 డిసెంబరు, 21వ తేదీ సోమవారం వైకుంఠ ఏకాదశిపర్వదినం. 22వ తేదీ మంగళవారం వైకుంఠద్వాదశిపర్వం. తిరుమల శ్రీవారిఆలయంలో డిసెంబరు 21వ తేదీ తెల్లవారుజామున రెండుగంటలకు సుప్రభాతం అయిన వెంటనే శ్రీస్వామివారికి చాలదగ్గరగా ఉన్న వైకుంఠద్వారాలు (ముక్కోటిప్రదక్షిణద్వారాలు) తెరువబడతాయి. ఈ ద్వారాలు మళ్లీ 22వ తేదీ వైకుంఠద్వాదశిరోజురాత్రి ఏకాంతసేవా సమయంలో మూసివేస్తారు. ఉదయం 8 గం॥ సమయంలో శ్రీస్వామివారికి బంగారురథంలో ఊరేగింపు జరుగుతుంది.

ఆ మరునాడు వైకుంఠద్వాదశి – 2015 డిసెంబరు 22వ తేదీ – "**స్వామిపుష్కరిణీతీర్థముక్కోటి**" రోజు సూర్యోదయసమయంలో శ్రీవారి ఆలయంనుండి శ్రీసుదర్శనభగవానుడు పల్లకిలో ఊరేగింపుగా ఆలయ మహాప్రదక్షిణమార్గంలో బయలుదేరి, శ్రీవరాహస్వామిఆలయప్రాంగణానికి చేరుకొంటారు. అక్కడ పాలు, పెరుగు, కొబ్బరినీరు, చందనం, పసుపు మున్నగువాటితో సుదర్శనచక్రత్తాళ్వారుకు తిరుమంజనం అయిన తర్వాత సుదర్శనభగవానునికి స్వామిపుష్కరిణిలో మూడుమార్లు పవిత్రస్నానం చేయిస్తారు. ఆ సమయంలో కోనేటిచుట్టూ ఉన్న భక్తులుకూడా సుదర్శన చక్రంతో పాటు పుష్కరిణిలో మునుగుతూ స్నానంచేసి, పునీతులవుతారు. ఈ రోజే "స్వామిపుష్కరిణీతీర్థముక్కోటి". ఈ రోజున తిరుమల కోనేటిలో స్నానం చేసినవారికి సమస్తతీర్థయాత్రాఫలం దక్కుతుందని మార్కండేయ మహర్షిగాథవల్ల తెలుస్తూంది.

**శ్రీవైకుంఠవిరక్తాయ, స్వామిపుష్కరిణీతటే ।**
**రమయా రమమాణాయ వేంకటేశాయ మంగళమ్ ॥**



**తత్ర స్నానం ప్రకుర్వంతి యే నరాః ప్రీతమానసాః**
**తే సర్వైః పాపై ర్ముచ్యంతే సగోత్రజ్ఞాతిబాంధవాః**

"ఆనాడు భక్తి ప్రపత్తులతో "స్వామిపుష్కరిణి"లో స్నానం చేసినవారు, వారివంశంలోని సగోత్రకులందరూ పాపాలనుండి విముక్తులవుతారని వేంకటాచలమాహాత్మ్యం వక్కాణిస్తోంది"- అంటూ ముగించాడు - బ్రహ్మదేవుడు.

సృష్టికర్తకు శిరసా నమస్కరించి, వేంకటాచలయాత్రకు వెంటనే బయలుదేరాడు - మార్కండేయుడు.

సరిగ్గా, స్వామిపుష్కరిణీతీర్థముక్కోటినాటికి తిరుమల క్షేత్రం చేరుకొన్న మహర్షికి ఒక అద్భుతమైనదృశ్యం గోచ రించింది.

బ్రహ్మాండంలో తీర్థాలన్నీ వరుసకట్టి దివ్యరూపాలతో "స్వామిపుష్కరిణి"లో మునుకులు వేస్తూ తమ తమ పాపాల్ని పోగొట్టుకోవడం చూస్తూ- ఆశ్చర్యపడుతూ, వాటికి చేతులెత్తి నమస్కరించాడు. ఇన్నితీర్థాల పాపాల్ని ఇట్టే కడిగివేస్తున్న శ్రీస్వామిపుష్కరిణికి తూర్పుతీరాన సాష్టాంగదండప్రణామాలు సమర్పించాడు. ఆ కోనేటిలోని నిర్మలజలాన్ని భక్తితో స్పృశించి, కళ్లకద్దుకొని, తలపై సంప్రోక్షించుకొని ఇలా ప్రార్థించాడు.

"తల్లీ! పుష్కరిణీమాతా! నీ పవిత్రజలాల్లో దిగి స్నానం చేస్తున్నందులకు నా భాగ్యం ఏమని చెప్పగలను! ఈనాటి అరుణోదయవేళలో నీ విమలోదకస్నానంచేత నాకు సమస్త తీర్థాల ఫలాన్ని ప్రసాదించు. అలాగే 'నాలోనిదోషాలను, కలుషాలను నిర్మూలించు తల్లీ!" - అంటూ సంకల్పపూర్వకంగా స్వామివారిపుష్కరిణిలో మూడుమార్లు మునుకలు వేశాడు. ఆ తర్వాత-

**మార్కండేయం పూర్వభాగే**
**మార్కండేయవినిర్మితమ్।**
**తత్ర స్నాంతి నరా యే తు**
**తేషా మాయుః ప్రవర్ధతే.**

అంటూ 'స్వామి పుష్కరిణి'లో తూర్పుభాగాన తాను స్నానంచేసినప్రాంతం "మార్కండేయతీర్థం" అని పేరు పొందు తుందనీ, ఇందులో ఎప్పుడు స్నానంచేసినా దీర్ఘాయుస్సు కలుగుతుందనీ, ముఖ్యంగా 'శ్రీస్వామిపుష్కరిణీతీర్థముక్కోటి" నాడు చేస్తే - రోగబాధలు తొలగి, అన్నికోరికలు తీరుతాయి అనీ వరమిచ్చాడు.

ఇలా పుష్కరిణీ స్నానం ఆచరించిన మార్కండేయుడు క్షేత్రసంప్రదాయంప్రకారం ముందుగా పుష్కరిణికి పడమటి గట్టున ఉన్న శ్రీభూవరాహస్వామివారిని దర్శించి,

"జలప్రళయంలో, సమస్తచరాచరాలైన వస్తువులతో కూడా మునిగిపోయిన భూమండలాన్ని తనకొమ్ముకొనలపై సముద్ధరించడానికి స్వయంవ్యక్తమై అవతరించిన ఓ ఆది వరాహభగవన్! నన్ను అనుగ్రహించు.

వరాహరూపంలో విరాజిల్లుతున్న పురుషోత్తమా! నీకు నమస్కారం. స్వామిపుష్కరిణీ తీరవాసివై వరాలు ప్రసాదిస్తూ, విశ్వమంగళకారకుడవై భక్తులను రక్షిస్తున్న శ్రీవేంకట వరాహదేవా! నీకు నిరంతరం నమస్కారాలు సమర్పిస్తున్నాను"- అని ప్రార్థించాడు.

వరాహస్వామిదర్శనానంతరం మార్కండేయుడు ఆనంద నిలయుడైన శ్రీ వేంకటేశ్వరస్వామివారిని దర్శించి,

**శ్లో॥ పాహి మాం వేంకటాధీశ!**
**ప్రణతార్తిప్రభంజన!**
**ఆత్మబంధో! కృపాసింధో!**
**సతతం తే నమో నమః ॥**

అందరి ఆత్మబంధుడవు, దయాసముద్రుడవు అయిన ఓ వేంకటేశ! నమస్కరించినవాళ్లబాధలు పోగొట్టే స్వామీ! నీకు ఎల్లప్పుడు నమస్కారాలు" - అని శ్రీనివాసుణ్ణి స్తుతించి, సంతుష్టుడై, శ్రీస్వామిపుష్కరిణీమాహాత్మ్యాన్ని, శ్రీనివాసుని దయాళుత్వాన్నీ కీర్తిస్తూ - తిరుమల క్షేత్రయాత్రను సఫలం చేసుకొని తపస్సుకు వెళ్లాడు. ●

**కులకాంతతోడ నెప్పుడు**
**కలహింపకు, వట్టితప్పు ఘటియింపకుమీ!**
**కలకంఠి కంట కన్నీ**
**రొలికిన సిరి యింట నుండ నొల్లదు సుమతీ!**




డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య

ఇది కట్టుకొన్న భార్యతో ఏ రోజూ కలహించవద్దని, అబద్ధాల తప్పులు వట్టి, ఆమె మనస్సును నొప్పించవద్దని, ఇల్లాలు కంట తడిపెట్టితే సిరి ఇంట నుండనొల్లదని భర్తలకు బుద్ధి చెప్పే పద్యం. భార్యాభర్తలమధ్య ఉండవలసిన ప్రేమాను రాగాలను గుర్తుచేసే పద్యం. దాంపత్య జీవితం సుఖశాంతులతో సాగిపోవాలని తెలియచెప్పే పద్యం.

మానవీయాలైన అనుబంధాలన్నింటిలో ఆద్యమైనది, అత్యంతప్రధానమైనది, ఎంతో దృఢమైనది, సుదీర్ఘమైనది భార్యా భర్తల సంబంధం. సుసంఘటిత కుటుంబవ్యవస్థకు, సమాజ విస్తరణకు, దాని పురోగతికి, సహజీవనసంస్కృతికి, సహకార భావస్ఫూర్తికి ఇదే బలమైన పునాది. అందుచేతనే, అతిప్రాచీన కాలంలోనే భారతీయసంస్కృతి వివాహాన్ని ఒక పవిత్రజీవిత యజ్ఞంగా భావించింది.

దాంపత్యాన్ని ఎవరో ఇద్దరు స్త్రీపురుషుల వైయక్తిక శృంగారవ్యవహారంగా కాక, ఒక బాధ్యతాయుతమైన సామాజిక విశిష్టజీవనవిధానంగా రూపొందించింది. గృహస్థాశ్రమానికి అనేకబాధ్యతలు అప్పగించింది. వివిధధర్మాలు ప్రవచించింది. మహోన్నతలక్ష్యాలు నిర్దేశించింది. గొప్పపవిత్రతను కల్పించింది. యావత్ప్రపంచంలో ఇలాంటి వైవాహికవ్యవస్థ ఇంకొకటి లేదనిపించేటట్లుగా తీర్చిదిద్దింది.

భారతీయదాంపత్యజీవితంలో భార్యాభర్తలది 'వేరు-వృక్షం'లాంటి సంబంధం. గృహస్థాశ్రమంలో పురుషుడు ఒక మహావృక్షంలా పెరగాలని, పదిమందికీ నీడ నివ్వాలని, సమాజానికి అనేకరసవత్ఫలాలను అందివ్వా లని, అప్పుడే అతని జీవితానికి ఒక సార్థకత అని- ఆ పురుషవృక్షం శాఖోపశాఖలుగా పెరగటానికి, బలంగా నిలబడటానికి, పుష్పఫలభరితంగా శోభిల్లటానికి భార్య తల్లివేరులా నిలిచి, అవసరమైన బలాన్ని ఆ వృక్షానికి అందివ్వాలని, భారతీయసంస్కృతి భావించింది. అందుకే "మమజీవన హేతునా" అని భర్తచేత భార్యమెడలో తాళి కట్టించింది.

అందువల్లే భారతీయ దాంపత్యం దైహికస్థాయిని అధిగ మించిన స్త్రీపురుషమనస్సమాగమం; ఆత్మసంగమం; జన్మ జన్మల అనుబంధం; పరమపవిత్రమైన బంధం.

ఇందులో ఉండవలసినవి అనురాగాలు, ఆత్మీయతలే గాని - వేధింపులు, బాధింపులు కావు. ప్రగాఢవిశ్వాసాలు, పరస్పరసహకారాలే గాని - అనుమానాలు, అవమానాలు కాదు.

కాగా, స్త్రీ జీవితం చాలా చిత్రమైంది. ఆమె ఎక్కడో ఎవరింట్లోనో పుట్టుతుంది. ఎవరినో పెళ్ళాడి మరో ఇంటికి వెళ్లుతుంది. అక్కడ ఆమెకు అందరూ క్రొత్తవ్యక్తులే. అంతా క్రొత్త వాతావరణమే. అయినా, ఒకే ఒక విశ్వాసంతో, ఒకే ఒక్క ధైర్యంతో ఉత్సాహంగా ఆమె అత్తవారింటికి వెళ్లుతుంది. అదే- భర్త తనవాడన్న విశ్వాసం! అదే- భర్త తన వాడన్న ధైర్యం! భర్తే అన్నీ తానై తన్ను చూచుకొంటాడన్న భావం! ఒక రసమయ లోకంలో తాను అడుగిడుతున్నానన్న ఉల్లాసం! ఒక గొప్ప జీవితం తనకు లభించబోతుందన్న ఆనందం!

భర్తజీవితమే తన జీవితమని, భర్తఅభ్యుదయమే తన అభ్యుదయ మని ఆమె భావిస్తుంది. మనఃపూర్వకసహాయ సహకారాలు అందిస్తుంది. ఆమెది ప్రేమించే గుణం. అర్పించే గుణం.



అలాంటి అర్ధాంగితో భర్త కలహిస్తే, ఆమెను బాధిస్తే ఎంతపాపం! పాపపుణ్యాల సంగతి భగవంతుడు ఎరుగు. మగవాడి జీవితంమాత్రం మధురంగా ఉంటుందా? సుఖసంతోషాలతో సాగుతుందా? జీవితాన్ని అనుభవించటం అంటే రకరకాల క్లబ్బుల చుట్టూ, పబ్బుల చుట్టూ తిరగటమా? పెద్దపెద్ద హోటళ్ళలో భోజనాలు చేయటమా? ఖరీదైన కార్లలో ప్రయాణించటమా? జీవితాంతం అవసరాన్నిమించిన ధన సంపాదనలో తలమునకలై ఉండటమా?

జీవితభాగస్వామికి ప్రేమానురాగాలు అందిస్తూ, ఆమె ప్రేమాభిమానాలు అందుకొంటూ, పిల్లలతో, బంధుమిత్రులతో కలసి, హాయిగా గడపకుంటే వైవాహికజీవితానికి, కుటుంబ జీవితానికి సార్థకత ఏముంది?

మానవజీవితంలో నిజమైన సిరిసంపద లంటే భూములా? భవనాలా? పదవులా? కరెన్సీ కట్టలా? ఇవి అవసరమైనంతమేరకు ఉంటే చాలు. మనిషికి జీవితంలో నిజమైన సిరిసంపదలు ఏవి అంటే - అవి సుఖశాంతులే! అర్ధాంగి కంట తడిపెడితే అవి ఇంట ఉంటాయా? అవి ఇంట లేకుంటే తక్కినవి ఎన్ని ఉన్నా ఏమి ప్రయోజనం? అందుకే శతకకర్త అంతగట్టిగ పురుష జాతిని హెచ్చరించాడు.

మహాభారతంలో శకుంతల మరో అడుగు ముందుకు వేసి గుణవతి, అనుకూలవతి, సంతానవతి అయిన భార్యను అవమానిస్తే భర్తకు ఇహపరాలు రెండూ ఉండవని ముఖంమీద కొట్టినట్లు దుష్యంతుడికి చెప్పింది.

దేశకాలపరిస్థితులు మారవచ్చు. ఆచార వ్యవహారాలు కొన్ని మారవచ్చు. కాని, భార్యవ్యక్తిత్వాన్ని గౌరవించి, అనురాగమయంగా ఆమెతో జీవించాలి. అలా కాకుంటే, ఎన్ని ఉన్నా జీవితంలో మాధుర్యం, సుఖశాంతులు ఉండవు.

లోకంలో కట్నాలు తెమ్మని భార్యలను బాధించే భర్తలు, వ్యసనాలకు బానిసలై భార్యలను హింసించే భర్తలు, న్యూనతాభావం పెంచుకొని, భార్యలతో కలహించే భర్తలు, తన తల్లి- కోడల్ని లేనితప్పులు పట్టి నానా ఇబ్బందులు పెట్టుతుంటే, ఎందుకు నా భార్యను ఇలా వేధిస్తున్నావని అడుగలేని భర్తలు, అనుమానాలతో భార్యల్ని అనుమానించేభర్తలు, ఆత్మవిమర్శ చేసుకొని, భార్యతో హాయిగా జీవించటానికి అద్భుతంగా దోహదం చేసే పద్యం - ***ఈ సుమతీశతకపద్యం.*** ●

